

వడగాడ్పులో నీడల దారి

—ఫోటో : ఆర్. పి. రంగారావు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder K. NAGESWARA RAO

సంపుటము 47
సంచిక 30
7-4-54

జయ చైత్ర శుద్ధ పంచమి బుధవారం




పంచాంగ శ్రవణానికి

—గోలి శేషయ్య.

## ముఖచిత్రం

"తాం వీక్ష్య సర్వావయవానవద్యాం
రతేరపి శ్రీః పదమాదధానామ్
జితేంద్రియే శూలిని పుష్పధన్వా
స్వకార్య సిద్ధిం పునరాశశంసే."

చిత్రకారుడు : దశిక రామలింగేశ్వరరావు.

## విషయానుక్రమణిక








"వలపు వహించె గంధగిరి
వాత పరంపరః - భూరి భూజ శా
ఖలు చిగిరించెః - నిండె పసగ
గాకలి కోకిలలందుః - చెక్కులం
దలుచని ఘర్మబిందువులు
భామలకుం బ్రసరించెః - సౌఖ్యదం
బెలువు ఘటింప జాలదు
విశేష వసంత సమాగమంబిలన్?"

తా॥ మంచి గంధపు వృక్షములుగల పర్వతములనుండి వచ్చెడి వాయువులు కమ్మని పరిమళ భరితములైనవి. పెద్ద పెద్ద చెట్ల కొమ్మలు చిగిరించినవి. కోకిలలకు మాతమున మై కాకలి యనెడి హెచ్చుస్థాయిలో అవి కూయుచున్నవి. స్త్రీలకు చెక్కిళ్లయందు చెమట బిందువులు కొంచెము కొంచెముగా ఏర్పడి ప్రవహించుచున్నవి. వసంతఋతువు వైభవముగా ప్రవేశించినప్పుడు యీ లోకంలో క్రొత్త శోభ కలుగనటువంటిది ఏది కలదు?

మంచి గంధపు వాసనలతో కూడి కొండలమీదనుండి వచ్చేటటువంటి మలయ మారుతము అంటే ఎటువంటిదో సాధారణంగా పల్లపు ప్రాంతాలలోనూ, మెట్ట ప్రాంతాలలోను, సముద్రతీర ప్రాంతాలలోనూ ఉండేవాళ్లు ఊహించలేరు. కొన్ని రకాల చెట్లు పర్వత ప్రాంతాలలో విరివిగా పెరిగి ఘుమ ఘుమ లాడుతూ ఉంటాయి. ఆమాట నిజమే. ఆ ప్రాంతాలలో నివాసంగా ఉండేవాళ్లకు ఆ సువాసనల సుఖం తెలుస్తుంది. నీలగిరి పర్వత ప్రాంతాలలో యూకలిప్టస్ చెట్లు పెరిగి ఉంటాయి. ఆ చెట్లనుంచి యూకలిప్టసు తైలం తయారుచేస్తారు దీనినే నీలగిరి తైలం అంటారు. ఇది చాలా ఘాటుగా ఉంటుంది. ఆ చెట్లఆకులను నలిపి వాసన చూస్తే చక్కని పరిమళం పరమానందంగా ఉంటుంది. ఈ తైల సువాసన ఊపిరితిత్తుల లోనికి పోయినయెడల శ్వాసకోశములను శుద్ధి చేయగలదు. క్రిమిదోషం ఏదైనా ఉంటే హరించివేస్తుంది. అటువంటి చెట్లు పెరిగిన చోట్లలో విహరిస్తూ ఆ గాలిని పీల్చుతుంటే ఆరోగ్యం ఎంతో యోగ్యంగా ఉంటుంది. కాశ్మీరప్రాంత పర్వతసీమలందు కుంకుమ పూవు మొక్కలు పెరిగి నేత్రానందకరంగా ఉంటాయి. ఆ కొండప్రదేశం మీదుగా వీచెడి గాలిలో కుంకుమ పూవు ఘుం! ఘుం! అంటూ ఉంటుంది. ఇటువంటివి అనేకం యీ దేశపు పర్వతప్రాంత పరిమళమ్ములై పరమహంసలను కూడా పరవశుల నొనర్చ గల మత్తుమందులవలె పనిచేస్తాయి. అనేది వాస్తవం.

అటువంటి పర్వత సీమలకు వెళ్లి తపస్సు చేసికొనెడివారు సమస్త భోగేచ్ఛలనూ విసర్జించి, సంసారసుఖాలకు రాజీనామా యిచ్చి, అత్తరుసాహెబ్బులు కను చూపు మేరలో కన్పించని కొండకనుమలకు పయనమైపోతారు. కాని, ఆ ప్రాంతాలలో వారు అనుభవించే ప్రకృతిసిద్ధమైన శృంగారము శయనాగారంలోకూడా అంత నయనానందకరంగా ఉండదు. చక్కని తెల్లని పచ్చిక బయళ్ళమీద పరుగెత్తుతూ ఉంటాయి. నెమళ్ళు పింఛములువిప్పి ఆడుతూఉంటాయి చెట్లమీద గువ్వలు, చిలుకలు సరసాలాడుకుంటూ ఉంటాయి.

కోయిలలు "కూ! కూ!" అని షోకుగా పిలుస్తూ వెక్కిరిస్తాయి. "ఏమిటీ తపస్సు! ఎదురుగుండా కన్పించేది అంతా చూడరానిదా? విన్పించేది అంతా వినరానిదా? శరీరానికి హాయిగా సోకుతూ, చల్లగాలి వీసుంటే, పుష్పవతులైన లతలు అంటరానివా? నిష్ఠా గరిష్ఠుడవైన నీవొక్కడవు శ్రేష్ఠుడవా? "ఆనందమే బ్రహ్మ" అని ఆలాపన చేస్తావు గదా, ఉయ్యాలలో బిడ్డను పెట్టుకొని, ఊరంతా వెతికిన యిల్లాలువలె, ఎదురుగుండా ఉన్నదానిమీద ఎదలేని అధమునకు, పరమపదం పంచాగ్నులమధ్య తపస్సుచేస్తే లభిస్తుందా? భోగం అహుతి చేసే ఈ భోగిమంటలవల్ల బుగ్గి మిగులుతుంది నీకు. నందనవనంలో ఉన్నది ఆనందం. నవ రంధ్రాలు బంధించి సమాధిలోకి వెళ్లితే,

ముంది మన్నా? ఇదంతా మిథ్య; ఇదంతా మోసం; ఇదంతా భ్రమ; ఇదంతా మాయ; అనేటట్లయితే, జగత్తంతా మాయఅయితే, నీవవరు? లోకం అంతా అసత్యం; నీవు ఒక్కడవుమాత్రం సత్యం అంటావు. ఇంత కన్నా పైత్యం ఇంకొకటి లేదు. శుకపిక శారికలయందు లేనివిలువ, నీఒకధ్యానమునకు ఉన్నదంటావా? పికరాజములు, లేతమామిడి చిగుళ్ళువేసి, కూతలు కూస్తూ ఉంటే, అదంతా బ్రహ్మముఖంలోనుంచి వచ్చిన సామగానం కాదంటావా? పికాలాపమున కెంత పైకమిచ్చి విలువ కట్టగలవు? వెండి బంగరు తీగెలు మోగించినా, ఈ కోయిల కూతలపై గోత పుటించునా? ఈ పైక నినాదమునకు మించిన అయిహికానందం ఇంకొకటి ఉన్నదని యిమ్మహిలో ఏమనిషి కల్లకపటం లేకుండా బల్లగుద్ది చెప్పగలడు? బుద్ధి పెడత్రోవల జిక్కి ప్రుక్కి వెర్రి తలలు వేసినది విరాగికిగాని, రాగికి కాదు. నీ వైరాగ్యమే ఒక మిథ్యావ్యాపారంగా ఉందిగాని, ఈజగత్తుమిథ్య కాదు పెరటిలోని మొక్క మందుకు పనికిరాదన్నట్లుగా, ఈజగత్తులోని ఆనందమయమైన పరబ్రహ్మము వల్ల ప్రబోధం పొందలేకుండా ఉన్నావు నీలో ప్రవేశించింది ఒక విధమైన బుద్ధి జాడ్యం. ఇది నీ రోగం. అది మిథ్యా వైరాగ్యరోగం" అని యీ విధంగా కొండలమధ్య తపస్సు చేసేవాళ్లను, అనేక తత్వవిచారణలకు ఉసికొల్పెడి తరుణంలోనే అరుణోదయం అయినట్లుగా మహాత్ములకు జ్ఞానోదయం కలుగుతూ ఉంటుంది ఇదంతా ఎందుకు తర్కించవలసి వచ్చిందంటే, అడవులలోనికి, కొండలలోనికి వెళ్లి తపస్సు చేసికొనేవాళ్లు యింద్రియములను పరవశంచేసే భోగములను విడిచిపెట్టి దూరంగా వెళ్ళి అట్టి తలపులు రాకుండా తలుపుమూసితలదాచుకున్నారనితలంచుటకు తావులేదని సీదాగా సోదాచేసి చూపించుట కొరకేగాని, మరొక కారణంచేత కాదు. రాజభవనం విడిచి తపోవనం చేరినా యోగిని భోగిచేసే ఉద్దీపన అక్కడకూడా ఎక్కువగానే ఉంది.

ఏమైనప్పటికీ వసంత ఋతువు వచ్చిందంటే, "భూరి భూజశాఖలు చిగిరించె; - నింపెసగె గాకలి కోకిలలందు" అనేది ఎంత సత్యమో, 'భూరి భూజ శాఖల విడె నాకు; లింపెసగె గాకలి కోకిలలందు' అనే మాటకూడ అంత సత్యమే. చెట్లు చిగిరించినవంటే, పాత ఆకులన్నీ రాలిపోయినవనే అర్థం. అటువంటి సమయంలోనే యీ కొత్త యిగుళ్లను ఆరగించి ఆవేశంతో కోయిలలు నినాదాలు సాగిస్తాయి. ఏదో కొంత రసావేశం వాటికి వచ్చిందంటే, ఆ మహిమా ప్రభావం అంతా ఆ కొత్త లేతచిగుళ్ళలో ఉన్నదంటారు కవులు. రాలిపోయిన పాతఆకుల వంటివే యీకొత్తగా చిగిరించిన యిగుళ్లు కూడా యుగం మారగానే ఆకులు రాలి ఆకులపాటు వస్తుంది లోకానికి కాని, యుగం మారుతున్నప్పుడే, కొత్త కూతలూ గీతలూ వినిపిస్తాయి. "సంభవామి యుగే యుగే" అనే భగవద్గీతా వాక్యం ఏమిటి? ఈ యుగం పోయి ఇంకోయుగం వచ్చేసరికి భగవంతుడు మరొకసారి అవతార మెత్తుతాడు. అప్పుడు లోకానికి మళ్లీ చైతన్యం వస్తుంది. అప్పుడు తిరిగీ మరొక భగవద్గీతను లోకానికి ఉపదేశిస్తాడు యుగపురుషుడు. అప్పుడు యీ భగవద్గీత పాతదై దానిలోని శ్లోకాలు కొమ్మలనుండి పండి ఎండిరాలిన ఆకులై లోకులు వాటిపై పరాకు చిత్తగిస్తారు లోకం వివేకం పొందవలెనంటే కొత్త లోకం కొత్తశ్లోకం ఏదైనా చదివి చవిచూచి కొత్త పరిపాకంలోకి రావాలి.

"ధర్మక్షేత్రే కురుక్షేత్రే" అనే శ్లోకంతో భగవద్గీత ప్రారంభమైంది. పూర్వమొకప్పుడు అనేక లక్షల సేన నాశనం అయినటువంటి కురుక్షేత్ర మహాసంగ్రామం జరిగింది. ఆ సంగ్రామానంతరం భారతదేశం అంతా నానా భీభత్సమైపోయింది. మానవ సంఘం అవేదానిక ఒక్క మానం, ప్రమాణం నిర్ణయించేనాథుడు కన్పించలేదు. కౌరవులు నాశనమైనా పాండవులు గెల్చినా, ఉభయులకూ భుక్తమైంది రక్తప్రవాహం—వాది గెల్చినా, ప్రతివాది ఓడిపోయినా, ఒక్కటే—ఓడినవాడు కోర్టులోనే ఏడుస్తాడు గెల్చినవాడు కొంపకువచ్చి ఏడుస్తాడు సుక్షేత్రమైన పది యకరాలు గెల్చినందుకు నిక్షేపమైన పదివేలు పోయి అక్షయపాత్ర చేతికి వచ్చినదని ఏడుస్తాడు అటువంటి స్థితిలో లోకం ఏమంటుందంటే, "వెర్రికుదిరింది రోకలి తలకు చుట్టు" అంటున్నది. అదే ప్రపంచానికిపరీక్షాసమయం. పరీక్షిన్మహారాజుకు పట్టముగట్టిన సమయం అదే అటువంటి మహాసంగ్రామానంతరం లోకాన్ని కట్టుదిట్టం చేయడానికి, తిరిగీ మహాసంగ్రామాలుతలయెత్తకుండా చక్కని ధర్మమార్గం ధరనుండేలా జనులందరికీ బోధించ

# ★ కాలక్షేపం ★

గల మహాత్ముడు అవతరించాలి. అనేక ధర్మ సమస్యలు అవతరించినప్పుడే, అనేక కొత్త భావాలు చిగిరించినప్పుడే, కొన్ని రీతులు నీతులు గల గీతలు బోధించెడి వేణుగోపాలుడు కోయిలవలె కాకలీస్వరంతో ఉచ్చ స్థాయిలో ఉత్కృష్ట విషయములను ఆలాపనచేస్తే, మరొక మహావిలయం లేకుండా మానవలోకానికి మంగళహారతి యిచ్చినట్లుగా ఉంటుంది.

మహాభారత సంగ్రామం ముగిసినతర్వాత దేశంలో వీరులైన మొగవాళ్ళు సంగ్రామంలో చచ్చిపోయినారు. స్త్రీ సంఖ్య దేశంలో ఎక్కువైంది పురుష సంఖ్య తక్కువైంది. వీరులు హరించి దేశం నిర్వీర్యమైంది. లెక్కకు మించిన స్త్రీలకు ఎక్కడి నుంచి వస్తారు భర్తలు? దేశంలో వ్యభిచారం ప్రబలమైంది. అదివరకే దేశంలో నియోగపద్ధతి అనే సంప్రదాయం ఒకటి ఉంది. భర్తవల్ల సంతానం కలుగకపోతే, కులగురువువల్ల భర్త అనుమతితో సంతానం పొందవచ్చు ననే మర్యాద ఒకటి ఉంది. ఈ ఆచారంవల్ల కూడా వ్యభిచారానికి మరింతప్రచారం వచ్చింది. యుద్ధంలో అనేక కుటుంబాలు మొగపురుష లేకుండా నిరాధారమైనాయి. చిత్తము వచ్చినట్లు కత్తులతో కుత్తుకలు కోసికొనడమే వీర లక్షణం అనే భావం ప్రబలమైంది చావు అంటే భయంపోయింది. రాజులకూ ప్రజలకూ రోషం, మోసం, ఆవేశం మిగిలినవి ఆయువు ఉన్నన్నాళ్లూ అనుభవించడమే అవశ్య కర్తవ్యం గాని, నరలోకం తర్వాత నరకలోకం ఉన్నదంటే నమ్మవలసిన మాట కాదన్నారు. ఈ లోకం తప్పితే యింకో లోకం ఎక్కడుంది నీ మొహం? అని లోకాయతులు వాదించారు కుతర్కాలు పసందుగా చారుతర వాక్కులతో చేశారు చార్వాకులు-ఇటువంటి భౌతిక భోగానుభవమే సాగించవలసినదన్న వారందరూ ఒక కులంగాఏర్పడ్డారు. ఆకులంలో చేరిన కౌలాచారులందరూ, ఆహార విహారాలలో అచ్చుపోసిన ఆబోతులైనారు. మద్య విషయంలో ఎంత త్రాగితే, అంత పేరు మోగిశనవాళ్ళవుతారు. వివాహం అనే కట్టుబాటు కౌలాచార పద్ధతికి కంచుకాగడా వేసి వెతికినా కన్పించదు. ఇటువంటి స్థితి అనేక కారణాలవల్ల ఏర్పడవచ్చు. దేశంలోకి పడమటి సీమలనుండి వచ్చిన అనేక యితరజాతుల వారి సంపర్క సాంకర్య దోషమువల్లనూ, బర్బర, యవన, బాహ్లీక జాతులయొక్క నీచసంప్రదాయాల సహవాసదోషమువల్లనూ, దేశంలో నిజానికి తగిన చుక్కాని లేకపోవుటవల్లనూ, అనేక విధాలుగా యుక్తివాదాలు చేసి జనవశీకరణ చేసిన తర్కపండితులు వెలసినందువల్లనూ భారతదేశం దారి తెన్నులేని భ్రష్టదేశం అయింది. అటువంటి పరిస్థితిలో అనేక సిద్ధాంతాలు మనిషికొక మతం అన్నట్లుగా వెలసినాయి

ఈవిధంగా వివిధ పక్షాలుగా ఏర్పడిన జనానీకం పలుకూతలు బహు నినాదాలు చేయడంవల్లనే, ప్రజాస్వాతంత్ర్య ప్రభ ఆనాడు ప్రశస్తంగా సాగిందని ప్రశంసించగలమా? అదే భారతజాతికి ఆనాటి నవవసంతమని అభినుతించగలమా? అటువంటి సమయంలో ప్రాత ఆకులన్నీ రాలిపోయినాయి. ప్రాతతాటియాకుల గ్రంథాలన్నీ మూలపడినాయి. కొత్తఆకులు చిగిర్చాయి. చార్వాకులు, నాస్తికులు, భౌతికవాదులు కొత్త శ్లోకాలు చదివారు. "పీత్వా పీత్వా పునః పీత్వా" అన్నారు. త్రాగి, త్రాగి మరల త్రాగి, తప్పలేదు తప్పత్రాగినా!" అన్నారు కౌలాచార పార్టీవారు.

ప్రజాస్వాతంత్ర్యం అంటే ఇదేనంటారా? ధర్మమార్గం చూపించగల పీఠం ఏది? అన్ని పక్షాలవారూ దేశక్షేమం, లోకక్షేమం కోరేవారే అన్ని పక్షులూ అంతరిక్షంలో ఎగిరి, స్వేచ్ఛావిహారనినాదాలు చేస్తాయి ఈ సర్వపక్ష సమావేశంలో ధర్మనిర్ణయం చేయడం ఎట్లా? ఏదో ఒక తీర్మానం ప్రతిపాదించడం. అనుకూలు రెందరో, ప్రతికూలు రెందరో కాకులను లెక్కపెట్టినట్లుగా లెక్కపెట్టడం. కాకు లెక్కువైతే కాకుల మాట నెగ్గుతుంది. కోయిల లెక్కువైతే, కోయిలలమాట నెగ్గుతుంది. ఒక్కొక్కప్పుడు కాకిగూట్లో పెరిగిన కోకిల, కాకి అండను చేరి పైకి వచ్చినకోకిల, సమయం వచ్చేసరికి "నీకూత వేరు, నాకూత వేరు"అంటుంది నీకు మద్యనిషేధం కావాలంటే నాకు మద్యనిషేధం అక్కరలేదు అని కూత కూస్తుంది "పీత్వా పీత్వా పునఃపీత్వా" అంటుంది ఒక పక్షి "న సురామ్ పిబేత్" (మద్యము సేవించవద్దు) అంటుంది ఇంకోపక్షి వసంతకాలం సంప్రాప్తించినప్పుడు "కాకః కాకః పికః పికః" కాకికాకే, కోయిల కోయిలే అవుతుంది.

ఇటువంటిదే పరీక్షాసమయం. ఇది ఎవరికి పరీక్షాసమం? కాకితత్వం తెలియడానికిన్నీ, కోయిలతత్వం తెలియడానికిన్నీ పరీక్షా సమయంకాదు. అసలు వసంతకాల ।సభావాన్ని పరీక్షించడానికే ఇది పరీక్షా సమయం. వ్యక్తిస్వాతంత్ర్యంయొక్క సత్తాను, ప్రజాస్వాతంత్ర్య విధానంయొక్క సత్తాను పరీక్షించే సమయం ఇది.

అసలు వసంతానికి జీవకళ రావాలంటే, సూర్యరశ్మిలోంచి రావాలి. మనం ఆహ్వానించవలసింది కోయిలకూతకు కాదు చిలుకపలుకులకు కాదు. మామిడిచెట్ల చిగుళ్లను చూచి కాదు. వీని నన్నింటినీ కళకళలాడేటట్లు చేసేది సూర్యుడు. ఆ సూర్యుని తేజం భజించి పూజించాలి. మన ప్రత్యక్ష దైవం ఆ లోకబాంధవుడే అని వేదాలు నినాదాలు చేశాయి. అటువంటి సూర్యులు యీ బ్రహ్మాండంలో ఎన్ని వేలున్నారో వేళ్ళుముడిచి లెక్కించ వీలుకాదు. ఒక్క సూర్యునకుఅర్ఘ్యంయిస్తేచాలదు అసంఖ్యాక సూర్యతేజమునకు బీజం అయిన పరబ్రహ్మం ఒకటిఉన్నదని బ్రహ్మసూత్రాలలో వ్రాసిన వ్యాసుడు మహాభారత మహాసంగ్రామం నాటి వాడు. ఆ బ్రహ్మనుగూర్చి జిజ్ఞాస చెయ్యడం ఎట్లా అనేది చెప్పినవాడు వ్యాసుడు. "అథాతో బ్రహ్మ జిజ్ఞాస" అన్నాడు అథ=అనగా-అటుతర్వాత(కర్మ సాధన మార్గమును తరచి చూచిన తర్వాత); అతః=అనగా యీ కారణము వలన (మోక్షమును పొందగోరుచున్న కారణము వలన); బ్రహ్మజిజ్ఞాస అనగా బ్రహ్మను గూర్చి ఉపాసన చేయవలసియున్నది కర్మానుష్ఠానముల సంగతిఅంతా చెప్పబడిన తర్వాత, మోక్షమునుపొందగోరుచున్న కారణము చేత, ఈజ్ఞానమార్గమైన జిజ్ఞాసను వివరిస్తున్నాను అని ప్రారంభించాడు. ఆబ్రహ్మ జిజ్ఞాసమీద ఆశ ఈదేశవాసులకు, సర్వ సంగపరిత్యాగులగు సన్యాసులకు వారి కాషాయవేషాలమీద గీచిన నల్లజీడి గుర్తు అనుట కల్లకాదు.

అటువంటి సర్వసంగపరిత్యాగులే యీ దేశానికి తేజం యిచ్చారు అటువంటి జ్ఞాన సూర్యుడు ఏరాశిలో ఉన్నాడో గమనిస్తేనే తప్ప భారతదేశం ఏ ఋతువులో ప్రవేశించిందో చెప్పలేము. పండ్రెండు రాశులలో సూర్యుడు వరుసగా ప్రవేశిస్తాడు. ఈ రాసులకు పేర్లు మొట్టమొదట యీజిప్టుదేశములో నిర్ణయించినట్లుగా కొందరు పెద్దలు వాదిస్తున్నారు. ఈ జిప్టు దేశీయులకు ఆ కాలంలో పూజనీయమైనది ఎద్దు. వారు పశుపతిని ఆకాలంలో పూజించేవారు. అందువల్ల ఒకరాశిని వృషభరాశి అన్నారు. ఇప్పుడు యీ ఏప్రిలుమాసంలో మేకలు యీనును అందువల్ల మేషరాశి అన్నారు. మే నెల ప్రాంతంలో మేకలు రెండేసిపిల్లలను ఈనునట. అందువల్ల మిథునరాశిలో

సూర్యుడు ప్రవేశించాడన్నారు. సూర్యుడు కొద్దిగా తిరోగమనంచేసి ఎండ్రకాయవలె వెనుకకు నడచినప్పుడు కర్కాటకం అన్నారు. సూర్యుడు ఎక్కువ తేజస్సుతో ఉండడంచేత సింహరాశిలో ప్రవేశించినాడన్నారు. పంటకోతలకాలాన్ని కన్యారాశిలో సూర్యుడుప్రవేశించినకాలంఅన్నారు. దివారాత్రములుసరిగ్గా సరిసమానంగా తుల తూచినట్లుగా ఉన్నప్పుడు తులా రాశి అన్నారు. రోగాలు ప్రబలమైనప్పుడు సూర్యుడు వృశ్చికరాశిలోకి వచ్చినాడన్నారు. వేటాడుట ప్రారంభించుటకు గాని అనుకూలమైనట్టిగాని దినాలను ధనుర్మాసం అన్నారు. మొసళ్ళు విశేషంగా ఒడ్డుకు వచ్చి గ్రుడ్లు పెట్టిపోయే కాలం కావడంవల్ల మకర మాసం కావచ్చు. కుంభంలో వారికి కుంభవృష్టి దినాలు అయియుండవచ్చు. మీన మాసంలో చేపలు సమృద్ధిగా లభించిన కారణంచేత దానికి మీనమాసం అని నామకరణం చేసి ఉంటారు.

మనకు, అనగా ఆంధ్రులకు ముఖ్యంగా, ఏది చూచినా మీనమేషాలు లెక్కపెట్టడంగానే ఉంది రాజధానికి తాత్కాలిక రాజధాని అన్నారు. హైకోర్టును తాత్కాలిక హైకోర్టు అన్నారు. ఆంధ్రరాష్ట్రమునే తాత్కాలిక రాష్ట్రం అన్నట్లుగా స్వీకరించారు ప్రభుత్వరథంకూడా క్రిరుక్రిరు మంటూ కందెన వోలు అనబడే కర్నూలులోకూడా కందెన పెట్టని యిరుసుతో ముందుకు నడుస్తోంది. ఆంధ్రరాష్ట్రమే తాత్కాలికం అనిన్నీ విశాలాంధ్ర పర్మనెంటు అనిన్నీ పంచాంగాలు గుణిస్తున్నారు. ఈ సంవత్సరం ఫజ్లల్ కమీషనువచ్చి భాషారాష్ట్రాలుగా దేశాన్ని విభాగంచేసే విషయమై పరిశీలిస్తారు. అప్పుడు మనం లెక్కపెట్టుచున్న మీనమేషాలన్నీ ఏమవుతాయో తెలియదు కర్కాటకం నాటికి మన ఆశలన్నీ ఎండ్రకాయలాగున వెనుకకు నడిస్తే, అది కర్కాటకమే గాక, చాలా కర్కోటకమైన పని. ఇప్పుడింకా మన కోరికలు తీగలు సాగుతూ ఉన్నాయి. భాగ్యనగరం మనదై మహా తెలింగాణాకు ముఖ్యనగర మవుతుందనే ఆశలు చిగురుస్తున్నాయి ప్రస్తుతం యీ నవవసంతంలో ప్రవేశించాము మన తెనుగు సంవత్సరాది మీనమాసం మేషమాసం మధ్యలో ఉండడమే ఒక విశేషం. సదా మీనమేషాలమధ్య ఉండడం మన తెనుగు విశిష్టలక్షణం. వెళ్లింది మీనమాసం వచ్చేది మేషమాసం. ఈ రెంటికీ మధ్య వచ్చేది తెలుగు ఉగాది. విజయ సంవత్సరంలో ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రం వస్తోంది అని విరహవేదన పడ్డారు. విజయవాడ మనరాష్ట్రానికి ముఖ్య నగరం అవుతుందని అశేష జనం కోరుకోయినా, విశేషజనం విరహతాపాల పాలైంది. విజయలోపడిన విరహమంతా రహితమైంది "వి"జయవాడ ముఖ్యపట్టణం కాలేదు "వి" శాఖపట్టణానికి హైకోర్టు రాలేదు "వి"జయ సంవత్సరంలో మన విరహమంతా "వి" రహితంగానే పరిసమాప్తమైంది. "వి" జయసంవత్సరం "వి"రహితంగా సమాప్తమై "జయ" సంవత్సరం సంప్రాప్తమైంది.

జయ్! జయహూ జై! అనవలసిన పని లేదు. ఆవిధంగా జయవాదం పలుకుట చింతకాయల పచ్చడిలో చింతపండు వేసినట్లుంటుంది. చిరంజీవి రావును, "చిరంజీవి చిరంజీవిరావు"అన్నట్లుంటుంది "జయ"లో మనకు జయం లేకపోతే, మన జయవాదాలన్నీ జయలో విశ్వాసంలేని శ్వాస వ్యయ నినాదాలవుతాయి. క్రొత్తరాష్ట్రం, కొత్త కోడలు, కొత్తచీర, కొత్త కాపురం, కొత్త ఆవకాయ వంటిది. అగరువత్తులు వెలిగించుకోవచ్చు. మంచిగంధం పూసుకోవచ్చు. మల్లెపూలు పెట్టుకోవచ్చు. మామిడిపళ్లు తినవచ్చు.

"ఎర్యోడం జెలువు ఘటింపజాలదు విశేషవసంత సమాగమంబిలన్?" వసంతంవస్తే దేనికి కొత్తసత్తా రాకుండును? "ఎంతో సంతసమీ నవ వసంతమూ!" అని పాటలు పాడవచ్చు. కాని, మామిడి పండ్లతత్వం బాగా బోధపడాలి. వాటినే సహకారఫలమ్ములంటారు. పదిమందితో కలిసి ఆరగించవలసిన ఫలం అది. ఎవరిమట్టుకు వారు గుట్టుగా పొట్ట పట్టినంతవరకు స్వాహా చేయవలసినదికాదు. ఎవరి కందినది వారు ఆరగిస్తే ప్రజాజీవితం సాహసాకరం అవుతుంది గాని అది సహకారం కాదు. సహకారం లేనిదే ఇంద్రలోకమైనా క్షుద్రలోకమే. ఇంద్రునికొడుకైన జయంతుడు కూడా వసంతుని యంతటి యందగాడే. మన కోరికలన్నీ చిగుర్చుచున్న యీ వసంతంలో యీ జయ సంవత్సరంలో యీ జయ వసంతంలో, పట్టినది బంగారమై ముట్టినది ముత్యమై, బోణీ రాణీ అయితే, అన్నీ జయమైతే, జయంతి వసంతులకు మించిన అనంతశోభ ఆంధ్రజాతిలో ఆవిర్భవిస్తుంది.

తెనుగువారి పంచాంగంలో ఏది ఎట్లా జరుగవలసిఉన్నదో పండుగనాడైనా పరిశీలించడం ప్రశస్తం.

జయ సంవత్సరానికి రాజు సూర్యుడయితే, మన ఆంధ్ర ప్రభుత్వం తిరిగి ఇక్ష్వాకులనాటి సూర్యవంశ ప్రభుత్వంగా ప్రత్యక్షమై రామరాజ్యం కావచ్చునని పద్యాలు వ్రాయవచ్చు. కాని ఆ కవిత్వ పంచాంగం అంతా కట్టిపెట్టవలసి ఉంది. ఈ సంవత్సరం సూర్యుడు రాజు అగుటవల్ల ఫలం ఏమిటంటే, ఎండ లధికం. వర్షములు తక్కువ రోగభయం హెచ్చు. యుద్ధములు సిద్ధము.

మీరు మహాశివరాత్రికి ఉపోష్యముంటారా లేక జాగరము చేస్తారా?

రెండూనూ! పగలు జాగరము, రాత్రి ఉపోష్యమూ!

—పి. వి. శ్యామలరావు.

రసాధిపతి కూడా యీ సంవత్సరం సూర్యుడే. అందుకు ఫలితం పంచాంగ గణితం ప్రకారంగా, ఏమిటంటే అధర్మము వృద్ధియగును, సమరములు సంభవించును.

ఎండలు ఎక్కువైతే, ఎంత ఎక్కువైనా థర్మామీటరుతో కొలవవచ్చు ఎండ వేడి మితిమీరిపోతే థర్మామీటర్లు కూడాపగిలిపోతాయి కాని అధర్మం ప్రబలమైతే, ఎంత ఎక్కువైనదో కొలచే అధర్మామీటర్లు ఏవి? అప్పుడుకూడా ధర్మంకొలచే థర్మామీటర్లు ధ్వంసమైపోవచ్చు. అటువంటి సమయంలోనే ధర్మాధర్మనిర్ణయం చేసేవాళ్ళు లేక, సమర ముమ్మరం అవుతుంది కొరియా క్షేత్రంలో జరిగిన యుద్ధంకంటె కురుక్షేత్రంలో జరిగిన యుద్ధం గొప్పది. ఈ కోణంనుంచి ఇంగ్లీషువారు యుద్ధం చెయ్యకుండానే జైహింద్! అని వెళ్ళిపోతే, యివారు, కానిపుదుచ్చేరిలోని ఫరంగీలు ఫిరంగులుకూడా కాల్చినతర్వాత సగౌరవంగా నిష్క్రమించ నిశ్చయించవచ్చు.

ఏమైనప్పటికీ యీ సంవత్సరము నీరాధిపతి చంద్రుడగుటవల్ల ప్రజలు ఆరోగ్యవంతులై సుఖము నందెదరు అని త్రికాలవేదులు గుణించియున్నారు ఈ విషయం నిజమని త్రివేదిగారు ఆంధ్రులకు అభయహస్తమిస్తే పాతపంచాంగాల చాదస్తం మనకు అక్కరలేదు జయలో విశాలాంధ్రను జయమగుటకు వారే మన సంజయులు. జై విశాలాంధ్ర! సర్వజనా స్సుఖినో భవంతు. సమస్త సన్మంగళాని భవంతు ★

# మర్చిలో మాన్నిరాగం

"ఆరుద్ర"

దుష్టుడికి దూరంగా ఉండమన్నా రని నిన్నటిదాకా మన దేశం యావత్తూ సోల్జరన్న పేరు వినగానే ఆ పేరుని కూడా అభారతీయంగా చూసి దాన్నీ, ఆ పేరుగలవాడినీ దూరంగా అట్టే పెట్టేవారు. పరాయి ప్రభుత్వం ఇచ్చే జీతం డబ్బులకి ఆశపడి నిన్నటిదాకా ఎంత మంది ఉద్యోగాలు చెయ్యలేదు? గాని వాళ్లందరిలోకీ చెడ్డవాడుగా సిపాయివాడే కనబడేవాడు. యుద్ధంరోజుల్లో మరీని.

మిలటరీ లారీ నడక ఎంత విచ్చలవిడిగా ఉంటుందో చూసిన, దానితోనే మిలటరీ వాడి నడతనికూడా సరిపోల్చుకుని రోడ్డు మీద ఆ రెండింటిలో ఏ ఒక్కటి కనబడ్డా, లేక రెండూ కలిసి కనబడ్డా పురజనులు దూర దూరంగా తప్పుకొనేవారు. "ఖాకీ యూనిఫారం కట్టుకొనడమే కాపురుషుల లక్షణం" అన్నట్టు చిన్నా పెద్దా ఆడా మగా అంతా భావించేవారు. ఆడవాళ్లు ఆమడదూరంలో మిలటరీవాడు కనబడగానే ఇంట్లోకిపోయి తలుపులు బిడాయించుకొనేవారు.

ఇండియన్ విమానదళం యూనిఫారం కట్టుకొని కొన్ని సంవత్సరాలు ఇండియా లోని కొన్నికొన్ని పట్టణాలలో సంచరించే భాగ్యం నాకు కలిగింది. ఆ రోజుల్లో, నన్నూ నేను కట్టుకొన్న ఖాకీబట్టలనీ చూసి నా దేశం గర్వపడాలని నేను ఆశించలేదు గాని చీదరించుకోకుండా ఉంటే చాలు అనిపించేది. దేశానికి స్వతంత్రం వచ్చేక మన సైనికులంటే మనం గర్వపడుతున్నాం. వాళ్లకి మర్యాదలు చేస్తున్నాం సదుపాయాలు కలిగిస్తున్నాం గాని దేశానికి స్వతంత్రం రాకముందూ మన సైనికుల్ని చూసి మనదేశమంతా గర్వపడినరోజు ఒకటి లేకపోలేదు.

ఆరోజుని దేశమంతా మరచిపోవచ్చు గాని, సైనికులూ మాజీసైనికులు మాత్రం మరచిపోలేరు. మన నావికులు తిరుగుబాటు చేసినరోజు వాళ్ళు తిరుగుబాటు చేస్తున్నారని తెలిసీ తెలియగానే తదితర సైనిక దళాలలో ఉన్నవాళ్లు ఒక్కసారి కళ్ళు తెరిచారు. అలా కళ్ళు తెరచీ తెరవగానే నావికులతో చెయ్యి కలిపి పోరాడడానికి నిశ్చయించారు.

ఆ రోజు నేను మరచిపోలేను. అంబాలాలో ఉంటున్నాను. ఆనాటి సాయంత్రం చీకటి పడుతూఉంటే మాకు కొత్త వెలుతురు కనబడుతూ ఉంది. రాత్రి ఎనిమిది గంటలు అయేసరికి మా కేంపులోని దేశభక్తులలో కొందరు వాళ్లంతట వాళ్లు నాయకత్వానికి ముందుకొచ్చారు. దాని అర్థం, దానివల్ల వచ్చే అనర్థంకూడా వాళ్లకి తెలుసు. అందుకే అనర్థాలు రాకుండా ఏర్పాట్లు చేసుకొని రాత్రిపూట భోజనాలయ్యాక విశాలమైన భోజనశాలలో భారతీయుడు ప్రతి ఒక్కడూ కూర్చునే ఉన్నాడు. కాంతివంతమైన ఎలక్ట్రిక్ దీపాలు వెలుగుతున్నాయి అంతకన్నా కాంతివంతంగా మా ముఖాలు ఉజ్జ్వలంగా ప్రజ్వరిల్లుతున్నాయి.

ఇంతలోనే ఉన్నట్టుండి ఎలక్ట్రిక్ దీపాలు ఆరిపోయాయి అవసరమైన చీకటి అలముకొంది. ఆ చీకటిలో ఒక కంచు కంఠం "కామ్రేడ్స్! మన సోదరులు నావికులు తిరుగుబాటు చేస్తున్నారని మీకు తెలుసు!" అని ఉపన్యాసం మొదలెట్టింది 'కామ్రేడ్స్' అనే మాటకి పవిత్రమైన అర్థం ఆ చీకటిలో ప్రతిఒక్కడికి బోధపడింది. నావికుల తిరుగుబాటుకి వైమానికులు ఎలా సహాయం చేయాలో ఈ తిరుగుబాటుని స్వాతంత్ర్య సమరంగా ఎలా మార్చాలో ఆ కంచుకంఠం విపులంగా కాకపోయినా విశదీకరించింది. ప్రతి ఒక్కడూ ఈ పోరాటంలో పాల్గొంటామని శపథం తీసుకోవాలని హెచ్చరించింది.

వెయ్యిగొంతుకలు ఒక్కసారి "ఇంకిలాబ్ జిందాబాద్" అని ఎలుగెత్తాయి. శపథం తీసుకొన్నాయి మర్నాడునుంచీ మా పోరాటం. ఇంకా ఎలక్ట్రిక్ దీపాలు వెలగలేదు నాయకులెవరో ప్రచ్ఛన్నంగానే ఉండాలి లేకపోతే ఆదిలోనే ప్రమాదం. చీకటిలోనే భోజనశాలనుండి బయట కొచ్చాం. బయటకివచ్చి రావడంతోనే మాకు కనబడినది మా బ్రిటిష్ కమాండింగ్ ఆఫీసరు!!!

"మీ ఉపన్యాసాలు విన్నాను. మీరు చేస్తున్నది చాలా తప్పు! మీ నాయకులెవరో నా ముందుకొస్తే వాళ్ళకి నచ్చచెప్తా" అన్నాడు మా సర్వాధికారి అతడు ఆశించిన అవివేకులు మాలో ఎవరూ లేరు "సరే జాగ్రత్తా! చూసుకోండి" అని సర్వాధికారి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి మాకు నిద్దర్లు లేవు. ఆయుధశాలలో, వైర్ లెస్ యంత్రాలదగ్గర డ్యూటీలో ఉన్న భారతీయులని కమాండింగ్ ఆఫీసరు వెంటనే ఆ రాత్రి డ్యూటీలోంచి తొలగించాడు. అయినా బొంబాయిలో కరాచీలో జరుగుతున్న విషయాలు ఏ నిముషానికానిముషం మా నాయకులకి వార్తలు వస్తూనే ఉన్నాయి! రహస్యంగా తెలియవలసినవాళ్లకి మాత్రం తెలుస్తూనే ఉన్నాయి.

(ఒక సభలో)

ఒకరు :— ఆ అధ్యక్షులు గారు మాటిమాటికీ బల్లగుద్ది మాట్లాడుతున్నారేమండీ!

ఇంకొకరు:—ఆయనగార్కి ముందెప్పుడో పోస్టాఫీసులో ముద్రలు గొట్టేపని కాబోలు.

—యల్. వి. సరోజ, చిత్తూరు.

* * *

కొత్త ముఖాలకోసం అన్వేషిస్తున్న ఓ చిత్రనిర్మాత ఓనాడు సముద్రపొడ్డున ఓదంపతిద్వయాన్ని చూసి భర్తని అడిగాడు!

"తమకు అనుమతిస్తే తమ అర్ధాంగిని చిత్రాల్లో ప్రవేశపెట్టాలని వుంది"

భర్త ఎగిరిగంతేసి పరవశత్వంతో అడిగాడు: "మరి ప్రతిఫలంగా నాకేం యిప్పిస్తారండీ?" అని.

"విడాకుల నోటీసు" అన్నాడు నిర్మాత క్లుప్తంగా.

—యస్ ఆర్. నంది.

# ఏప్రిల్ ఫూల్

భాస్కరం ప్రభాకరం

పంతులయ్యగారి కొక్క
పార్సెలు అందింది, చాల
పొడ్వైనది ఆపార్సెలు
పైకి చాల బాగున్నది.
పెట్టె మూత తీయగానె
వట్టి గడ్డి కనబడింది
వట్టి గడ్డి తీసేస్తే
వున్నదొక్క గమ్మత్తు.
ఏమిటి ఆ గమ్మత్తు?
ఏప్రిల్ ఫూల్! ఏప్రిల్ ఫూల్!

*   *   *

అర్జెంటౌ నేసుకుంటు
అడిగినాడు పంతులయ్య
"ఇంకు లేదు పెన్నులోన
ఇవ్వండ్రా వాకపెన్" అని
కుర్రవాళ్లు పెన్నిస్తే
క్యాపుతీసి చూడగానె
పాళి లేదు, ఇంకు లేదు
నాలికేది? ఇదియేమిటి?
ఏమిటి ఆగమ్మత్తు?
ఏప్రిల్ ఫూల్! ఏప్రిల్ ఫూల్!

*   *   *

మంత్రిగారు వస్తారని
కంతివార్త అందగానె
ఎవ్వరితోనూ చెప్పక
ఇల్లు వదలి వచ్చినారు
కౌన్సిలర్లు, కోమట్లూ
కామ్రేడ్లూ, కార్మికులూ
మెయిలువచ్చి వెళ్లిపోయె
మంత్రియేడి? మంత్రియేడి?
ఏమిటి ఆగమ్మత్తు?
ఏప్రిల్ ఫూల్! ఏప్రిల్ ఫూల్!

*   *   *

ఎరుపు నలుపు ఆకుపచ్చ
ఎన్నోరంగుల సిరాలు
చొక్కాపై పోద్దామని
సిరాబుడ్డి ఎత్తునరికి
పొరపాటున చేయిజారి
సిరావాలికె తనమీదనె
జనమంతా నవ్వినారు
తనుకూడా నవ్వినాడు
ఏమిటి ఆగమ్మత్తు?
ఏప్రిల్ ఫూల్! ఏప్రిల్ ఫూల్!

*   *   *

పెన్నులోన మంచినీళ్లు!
అగ్గిపెట్లో తేలుపిల్ల!
చింతగింజ ఉప్మాలో!
సున్నం స్నో సీసాలో!
ఫౌంటెన్ పెన్ రాయదేమి?
అగ్గిపెట్లో అయ్ బాబోయ్!
ఉప్మాలో ఇది ఏమిటి?
ఇది ఎక్కడి స్నో అయ్యో?
ఏమిటి ఈగమ్మత్తు?
ఏప్రిల్ ఫూల్! ఏప్రిల్ ఫూల్!

బొంబాయిలో మా విమానదళం కేంపుని బ్రిటిష్‌దళం చుట్టుముట్టినప్పుడు మరికొన్ని స్థావరాలలో తిండికూడా దొరకనివ్వ నప్పుడు పౌరులు వైమానికులకి, నావికులకి ఇచ్చిన ప్రోత్సాహం, చేసిన సహాయం ఇంతా అంతా కాదు.

సర్దార్ పటేలు పుణ్యం కట్టుకోకుంటా ఉంటే స్వాతంత్ర్యాన్ని సంపాదించిన ఘనత ప్రత్యక్షంగా మన సైనికదళాలకే దక్కేది. ఏమైతేనేం మనకి స్వతంత్రం వచ్చింది. అది కాంగ్రెసువాళ్ళు చేసిన ఘన కార్యాలవల్లే సిద్ధించిందనుకోమనండి. రాజకీయబాధ లనుభవించి స్వతంత్రాన్ని తెచ్చి, నందుకు భూములు పుచ్చుకోమనండి. నావికుల తిరుగుబాటులో పాల్గొని బ్రిటిష్ వాళ్లకి దొరికిపోయిన సైనిక నాయకులువిమైతే నేం? వాళ్లమీద నేరాలుమోపి, వాళ్లని శిక్షించి జైళ్లలో వేస్తే నేం? కఠినశిక్షలు అనుభవించి విడుదలపొంది వాళ్ళు పౌరజీవితంలో భావి భీతిలేని ఉద్యోగాలు దొరక్క అఘోరిస్తూ ఉంటే నేం? అది దేశం అంతగా పట్టించుకోదు. అందుకు వాళ్ళూ ఏమనుకోరు. ఆ తిరుగుబాటురోజుల్లో "మీతోనే ఉన్నాం" అని దేశం అన్నందుకు మాజీ సైనికులు జన్మ జన్మలంత సంతోషిస్తారు.

*   *   *

కేంద్రబడ్జెట్ రక్షణశాఖ డిమాండుపై చర్చ, ఇండియన్ విమానదళం ఇరవై రెండవ జన్మదినంలో జరిగిన వేడుకల వార్తలు చదువుతూఉంటే పై విషయాలు జ్ఞాపకం వచ్చాయి.

*   *   *

- పౌరులకి రైఫిల్ శిక్షణ ఇవ్వడానికి మహావీరత్యాగిగారు ఏర్పాట్లు చేస్తున్నారట. పూర్వం మిలటరీలో చేరమంటూ బ్రిటిష్‌వాళ్ళు భారతీయులకి ఒకరకం ఆశ పెట్టేవారు "ఎర్న్ వైల్ యు లెర్న్" "నేర్చుకొంటూనే డబ్బు కూర్చుకోనండి" అని. అతి చక్కని సలహా అది. మనకి స్వతంత్రం వచ్చాక అది మార్చుకపోతే బాగుండదని కబోలు త్యాగిగారు. "మీ జేబులో డబ్బులు త్యాగం చేసి నేర్చుకోనండి" అని పౌరులకి ఉబోధ చేసేటట్టు ఉన్నారు.

"భారత పౌరులలో ఎవరైనా సరే తగు ఏర్పాట్లు ఉన్న పోలీసులైసెను పెళ్ళి బాకు ఒక్కొంటికి ఒక అణా చొప్పున మందుగుండు ఖరీదు చెల్లించి రైఫిల్ కాల్చడం నేర్చుకోవచ్చు" అని త్యాగిగారి స్కీము. ప్రజలలో ప్రతిఘటనా శక్తి పెంపొంద చేయడంద్వారానే దురాక్రమణను నిరోధించగలమని త్యాగిగారి విశ్వాసం. దురాక్రమణని ప్రతిఘటించినా ప్రతిఘటించక

# ★ కుర్చీలో కూనిరాగం ★

ఆ మర్నాడు అంబాలా పురవీధులలో పెద్ద ఊరేగింపు చేశాం. అందులో విమాన దళంలోని ప్రతిఒక్క భారత సైనికుడు పాల్గొన్నాడు. నినాదాలు ఇచ్చుకుంటూ సాగాము. మమ్మల్ని చూసి వీథిలో ప్రతి ఒక్క పౌరుడూ గర్వించాడు. ఆడవాళ్ళు మమ్మల్ని చూసి ఆనందబాష్పాలు రాల్చారు. వృద్ధులు మమ్మల్ని దీవించారు.

తల్లి — ఒరే రాముడూ! నువ్వు మేడమీద అలా గెంతుతూంటే క్రింద ఎంత చప్పుడవుతోందో ఒక్కసారి యిలా వచ్చి విను.

—సి. వి. జగన్నాధరావు, కాకినాడ.

పోయినా "మీ డబ్బుతో నేతుపాకి పేల్చడం నేర్చుకోనండి" అనే స్కీముని ప్రజలు ప్రతిఘటిస్తారేమో అన్నది నా అనుమానం.

దేశాన్ని రక్షించుకొనే బాధ్యత పౌరులకి లేకపోలేదు. అందుకోసం అంతా మహా వీరత్యాగాలు చేయాలి నిజమే. గాని కష్టాలు ఈషణ్మాత్రం తీర్చటం లేని ప్రభుత్వానికి పన్నులు కట్టడమే మహా త్యాగంగా ఉంటున్నప్పుడు బారుకో అణా తగలెట్టి మందుగుండు తగలెట్టడానికి ఏ పౌరుడు ముందుకొస్తాడు? చెప్పులమీదా, చక్కాలమీదా పన్నులు వేస్తున్నారే. అలాగే ఏదోదానిమీద పన్ను వేసి ఆ డబ్బుతో నిర్బంధ ఉచిత ఆయుధశిక్షణ ఇస్తే పౌరులు సంతోషిస్తారు.

*　　　*　　　*

ఏ కొత్తపన్నులు వెయ్యాలో దేశముఖు గారికి తెలియకపోతే ఆయన కుగ్రామాలలోని పంచాయితీ అధికారుల దగ్గర రెండు రోజులు శిష్యరికం చేస్తే చాలు. అస్సాంలో దిబ్రుఘర్ సబ్ డివిజన్‌లో చాగువా అనే గ్రామం ఉందట ఆ ఊరి పంచాయితీ అధికారులు పెళ్లిళ్ళమీద పన్ను వేశారట.

"బహిరంగంగా జరుపుకున్న ప్రతి వివాహానికి అయిదు రూపాయల పన్ను. కాని గాంధర్వ వివాహానికిమాత్రం రెండున్నర రూపాయలు మాత్రమే!"

ఇలా పన్ను వేయడం బాగుంటుం దని ఏ మహానుభావుడికితట్టిందో అతణ్ణి ఒక్కరోజు ఆంధ్రరాష్ట్రానికి ఆర్థికమంత్రిగా పెడితే చాలు. లోటుబడ్జెట్లు అన్నవి ఉండవ్. తెన్నేటి విశ్వనాధంగారు కొత్తపన్నులు దేనిమీద వెయ్యాలో చెప్పడానికి మొహమాట పడుతున్నారుగాని ఈ పంచాయితీ వాళ్లనుంచి ఆయన నేర్చుకోవలసినది చాలా ఉన్నట్టు కనబడుతోంది.

*　　　*　　　*

ఆంధ్రా ఆర్థికమంత్రి చేసిన బడ్జెటు విందులో గవర్నర్ త్రివేదిగారు పత్రికా విలేఖర్లను కలుసుకొని "ఆశ్చర్యకరమైన వార్తలేమీ లేవు" అని చిరునవ్వుతో అన్నారట! పాపం! గవర్నర్ గారికి పాత్రికేయుల సత్తా తెలియదా! "ఆశ్చర్యకరమైనవార్తలు లేవు"అన్న వార్తనే చాలా ఆశ్చర్యకరమైన వార్తగా ప్రకటించ గల చాకచక్యం తలచుకొంటే పాత్రికేయులకి లేకపోలేదు చూడండి. మన విమానదళం ఇరవై రెండో జన్మదినం వేడుకలు ఢిల్లీకి పధ్నాలుగు మైళ్ల దూరంలో జరిగేయి. అక్కడికి ఢిల్లీనుంచి వెళ్ళడానికి ఆ ప్రేసేపు పట్టదు గాని ఊరు ఊరంతా అక్కడికే ఎగబడడం చేత తొడతొక్కిడి ఏర్పడి కొంతమంది పాత్రికేయులు అక్కడికి చేరుకొనడానికి వీల్లేకపోయింది. అయితే వాళ్ళు "అయ్యో అది చూడలేకపోయామే!" అని విచారించి కాగితాలు జేబులో పెట్టుకొని కూర్చున్నారా? అబ్బే! ఆ తొడతొక్కిడి రాకపోకల రద్దీనే వర్ణించి అదొక పెద్ద వార్తగా రెండుమూడు కాలమ్ను రాశారు! పాత్రికేయుడు తలచుకొంటే పుట్టించలేని వార్తంటూ లేదు.

*　　　*　　　*

కొసమెరుపు:—ఆశావాదికి నిర్వచనం! పొడుగాటి 'క్యూ' లో ఆఖరున నిలబడ్డ వాడివెనక నిలబడేవాడు. ★

# ఊర్వశి

### పఠాభి

(రవీంద్రుని వంగమాతృక నుండి అనువాదము)

## 1

నీవు తల్లివి కావు ఇల్లాలివియు కావు
కన్యవేనియు కాని కావుగా, ఊర్వశీ!
సుందరీ! రూపసీ! నందనవాసినీ!
పలుచంగ చీకట్లు పడునట్టి సమయాన
శ్రాంత దేహము పయిన స్వర్ణాంచలము లాగి
అల నల్ల రవళింప అందియల్ ముదుగులు
సంధ్యార్చి రగిలింప చనవీవు;—చనవీవు
వ్రీడాగమనవై, నిగూఢ హాస్యము తోడ
పడకిల్లు లోనికి;—పసిడి వేకువ విధాన
ముసుగేని లేనట్టి మొక్క వోవని మేటి
ఓసు కత్రియవీవు

ఓ యూర్వశీ!

## 2

వృంతహీన సుమమ్ము విధి నిన్ను నీవుగా
వికసించుకొని యుద్భవించితివ? ఊర్వశీ!
తొలియామని జగాన తెలవారు కాలాన
మంథితార్ణోరాశి మధ్య లేచితి వీవు
ఒక చేతిలోన పీయూష పాత్రిక బూని
వేరు చేతిన బట్టి విషపూర్ణ భాండమ్ము,
మంత్ర శాంత భుజంగమటులా మహాజలధి
వేనవేలుగ తనవెల్ల పడగల వంచి
పడియుండినది నీదు పాదాల చెంగట
శుభ్రకుందసమాన సురవందితవు నీవు
ఓ యనిందితమూర్తి!

ఓ యూర్వశీ!

## 3

ఏ నాడయిన చిన్నదానివిగ నీవుంటి
వా? ఓయనంత యౌవనవతీ, ఊర్వశీ!
ఏకాంతమయినట్టి ఏచోట నజ్ఞాత
ముగ నాడితివి నీవు ముత్యాల పల్యంకి?
క్షుబ్ధపాథోనిధి జోల పాడుచు నుండ
ఏతల్లి కౌగింట ఇంద్రనీలా లింట
పగడాల పాన్పున పవళించి యుంటివో?
నిరుపమ రోచితో నీ మందహాసము
దీపింప నే ధరిత్రి పునీత మయినదో?
ఏ శుభక్షణమందు నిలయందు లేచితో?
ఓ యౌవన ఘటిత!

ఓ యూర్వశీ!

## 4

సర్వ విశ్వమునకు సంతత ప్రియ వీవు
ఓ మహాపూర్వశోభామయీ, ఊర్వశీ!
నీ పదాల కడ మునీశ్వరుల్ కూడ, చి
రార్జిత తపముల్ విసర్జించుచున్నారు;
చలియించి నీ కటాక్షాఘాతమువల్ల
ఈమూడు లోకాలు కౌమార దశనొందు;
దిగ్దిగంతాల నీ దివ్యాతిమాధుర్య
వాసనాభరితాంధవాయువుల్ వీవంగ
మధుమత్త భృంగాల మాద్రి ముగ్ధకవులు
ఉద్దామసంగీత మొనరించుచున్నారు
ఓ తటిచ్చంచలా! ఓ యూర్వశీ!

## 5

ఉల్లాస పులకిత కల్లోలముగ, సుర
సభలోన నీవు లాస్యము జేయ, నూర్వశీ!
కనుము! ఛందస్ ఛందమునకు సింధువుమధ్య
లేచి యాడును రుద్రవీచీసమూహమ్ము
శస్యశీర్షముమీద శయనించి యున్నట్టి
భువనాంచలము తీవ్రముగ నూగు కంపించి;
నీ మేఖలమునుండి వ్యోమస్థలములోన
వెదజల్లబడుచున్నవి మహోజ్వలోల్కాలు
ప్రేక్షకావళి తీక్ష వక్షమ్ములకు మధ్య
చిత్తమ్ములను చీల్చిచీల్చి అకస్మాత్తు
నర్తనము చేయుచున్నది రక్తధార; ఓ
ఉన్మత్త నర్తకీ!

ఓ యూర్వశీ!

## 6

దివ్యోదయాద్రి సందీప్తరోచివి నీవు
ఓ భువన మోహినీ! ఓ ప్రోజ్వలోర్వశీ!

కదుగబడినది తావక తనూ తనిమ రోచి
జగదశ్రు ఝరియందు, సర్వజగతీ చిత్త
రక్తసిక్తము నీ చరణశోణ జలజాలు
ముక్తవేణివి, లుప్త నక్తకమ్ముల, వికసిత
విశ్వకామనా శతపత్రమున నీవు
నిలిచితివి లఘువుగ నీపాదపద్మాల,
మానస స్వర్గ సభారంజనివి, నీవు
ఓ స్వప్నసంగినీ!

ఓ యూర్వశీ!

7

ప్రతిచోట, నీకోసరము, ఆలకింపుము
రోదించుచున్నదీ రోదస్సు, ఊర్వశీ!
ఆదికాలము మరలిరాదా, జగమునకు?—
సింధు నీరమునుండి సిక్తకచములతోడ
ఉద్భవించవ మరియొకసారి, నీవహో?—
అఖిల మానవకోటి అశ్రుభూషణములను
ధరియించి రగులుము, దాన కానబడును
భవదీయ ప్రథమ ప్రభాత దేహోద్రోచి
కంకణమ్ములలోన కలకల నగుమంట,
పాథోనిధి తరంగ భాషన్ వినవనివు?—
ఓ నిష్ఠుర బధిర!

ఓ యూర్వశీ!

8

రాదింక;—తొలినాటి రవి యస్తమించింది
అస్తాచల శిఖరవిహారిణీ, ఊర్వశీ!
అందుకే, నేడీ వసంతకాలమునందు
ఆనందనోచ్ఛ్వాసన మే నారి విడచు, చి
ర విరహ తప్త దీర్ఘశ్వాసతో కూడి
వీచుచున్నది?-సర్వ పృథ్వీవలయమందు
నీరంధ్ర చంద్రికానిశి నవ్వుచుండంగ
భీరు స్వరముతోడ దూరసంస్మృతి చింత
ఏమూలనుండి మ్రోయించుచున్నది వంశి
నేత్రాలవడ వేడినీరు మానవులకు?—
కాని మా మనముల క్రందనమ్మున, ఆశ
ఉజ్వలించుచునుంది,

ఓ యూర్వశీ!










సీరియల్

శారద

## 1

పూరీపాసెంజర్ పెద్దగా కూత పెట్టి, ఒక్కసారి ఘూర్ణిల్లి, విజయవాడ ప్లాట్ ఫారంమీద ఆగింది. విజయవాడ స్టేషను, జనసమూహంతో కిటకిటలాడుతోంది; ప్లాట్ ఫారంమీద వందలాది మనుషులు అతి ఆదుర్దాతో, అటూ ఇటూ పరిగెత్తుతున్నారు. ఫలహారపు శాలలో జనం ఒకరిమీద ఒకరు పడి తోసుకుంటూ ఇడ్లీ, గారె, కాఫీలు సేవిస్తున్నారు. స్టేషన్లో దిగనవసరంలేని ప్రయాణీకులు కొందరు, రైలు పెట్టెలోకే ఫలహారాలు తెప్పించుకుంటున్నారు. తెల్లని యూనిఫారం దుస్తులు ధరించిన టికెట్ కలెక్టర్లు, ఖాకీ యూనిఫారం వేసిన పాసెంజర్ గైడులు, ఇతర రైల్వే ఉద్యోగులు, అడావుడిగా తిరుగుతున్నారు.

పూరీపాసెంజర్ విజయవాడలో సగం ఖాళీఐ, తిరిగి నిండుతోంది. రైలు దిగి వూళ్ళోకెళ్ళవల్సినవాళ్లు పెట్టెలూ మూటలు చేతబట్టుకుని వెళ్ళిపోతున్నారు. ఏపనీ లేనివాళ్లు కొందరు నిదానంగా, పేపరు చదువుకుంటూ వెళ్తున్నారు. అది వేసవి. పూరీపాసెంజర్ విజయవాడ చేరుకునేసరికి, దాదాపు 9 గంటలపైచిలుకు అవుతుంది. అప్పటికే వడగాలి మెల్లగా ప్రారంభమైంది. ఎండ ముదురుతుంటోంది. విజయవాడలో చెప్పులులేకండా కాలు కింద పెట్టటం అసంభవం.

భాస్కర్రావు పూరీపాసెంజర్ దిగి, చేతిలోని తోలుపెట్టె తెరిచి, టిక్కెట్టు తీసుకుని బయల్దేరాడు గేట్ దగ్గరకి. అతనికి 28 ఏళ్ళుంటాయి. అంత పొడవరీగాదు, పొట్టికాదు. చక్కని సుంద్రని మొహం; సన్నగా దువ్విన వత్తుగా పెరిగిన ఉంగరాల క్రాపు; దువ్వెన కెదురుతిరిగిన కొన్ని జుట్టు వుంగరాలు నుదురుమీద పడి వున్నాయి మల్లుధోవతి గోచిపోసికట్టాడు. ముందు కుచ్చిళ్ళు వదిలేశాడు. పెద్దాపురం సిల్కు లాల్చీ తొడిగాడు. అతని ఎర్రటి శరీరచ్ఛాయకు, ఆ దుస్తులు తగినట్టుగా సరిపోయినాయి.

ఎండ ఉగ్రం హెచ్చుతూ వుంది. భాస్కర్రావు గేట్ దగ్గర టిక్కెట్టు ఇచ్చి, జనసమూహంలోనించీ తోసుకుని ఎట్లాగో వూడి బైటపడ్డాడు. రాత్రల్లా పాసెంజర్లో, నిద్రంటూ పట్టనేలేదు. క్రిక్కిరిసి వున్నాయి పెట్టెలన్నీ. ఎటుచూసినా జనం. దుర్వాసన మొగం కడుక్కుందామని, చీరాలనుంచీ ప్రయత్నించాడు అతను. కుదరలేదు. మొహంపుల్ల చీరాల నుంచీ తెనాలిదాకా నవలటంతో, నోరంతా చేదెక్కింది. దీనికి తోడు, ఒంగోలు స్టేషనులో ఎక్కిన ముసలాయన ఒకడు ముట్టించిన చుట్ట, తెనాలి వచ్చే వరకూ కాగడా మల్లే వెలుగుతూ, రైలు ఇంజన్లాగా పొగ వొదుల్తూ అతనికి ఊపిరాడనిచ్చిందికాదు; అతని కిప్పుడు ఆ చిరాకూ, నిద్రలేమి బాధా కొంత తగ్గాయి.

ఎక్కడైనా ఓ హోటల్లోకి పోయి, మొహం కడుక్కుని, వేడి ఇడ్లీ, కాఫీ పుచ్చుకుంటేగాని, కాస్త కూస్త మిగిలి వున్న చిరాకుగూడా వొదిలిపోదు. భాస్కర్రావు గవర్నర్ పేటవైపు మెట్లెక్కి బ్రిడ్జిమీద నడుస్తున్నాడు బద్ధకంగా. మనస్సులో ఏవిధమైన దిగులుగాని లేకపోవటంచేత అతని మొహం తేటగా వుంది అతడట్లా బ్రిడ్జిమీద రెండడుగులు వేసి నిలబడిపోయినాడు.

ఎదురుగా, అయిదారు గజాలదూరంలో, అతని బాల్యమిత్రుడు, అతనియింటికి సమీపంలోనే ఉంటున్నవాడు, పాండురంగ ఎదురువస్తున్నాడు. పాండురంగ సరిగ్గా అతని ఈడే. కొంచెం నలుపు, పొడవరి, తీక్షణమైన చూపులూ, మాటలు తేలికగా, త్వరగా చెప్పగలవాడు.

పాండురంగకూడా తన మిత్రుని అకస్మాత్తుగా చూడ్డంతో, ఆదుర్దాతో పరిగెత్తుకొచ్చాడు. "అరరే! నువ్వు ఇవ్వాళ వొస్తావని, మీ నాన్నయినా చెప్పలేదే! నువ్వు ఇంత ఆలస్యంగావొస్తున్నావేమిటి? సంగతి తెలిసిందా నీకు?" అని అతడు గబగబా అడిగేశాడు. బ్రిడ్జికిందినించి, ఏదో ఇంజన్ పొగ వస్తోంది. కూత వినపడుతోంది, కర్ణకఠోరంగా.

"ఎట్లా తెలుస్తాదనుకున్నా? అయినా నేను వస్తానని తెలియందేవా!" అన్నా[illegible] భాస్కర్రావు, తన మిత్రుని చెయ్యి[illegible]కుని నిదానంగా నడుస్తూ

పాండురంగ ఆశ్చర్యంగా, కొత్తగా చూశాడు మిత్రునివంక. అట్లాగే రెండు మూడు నిమిషాలు చూస్తూ మౌనంగా నడిచాడు మిత్రునితోపాటే వాళ్ళిద్దరిపక్కల నించీ జనం తోసుకుంటూ నడిచి వెళ్ళిపోతున్నారు. జట్కావాళ్లు, సైకిల్ రిక్షావాళ్లు, ఎదురై, "బాబూ రండి. వూళ్లోకి



పద్మ తలెత్తి సవతికొడుకును చూసింది... ఒకనిమిషం ఆమెకు అంతా

# ★ మంచీ - చెడూ ★

మనిషికీ లేదాస్తీ" అంటూ ఆప్యాయంగా బంధువులయాదిరి ఆహ్వానిస్తున్నారు.

ఉన్నట్టుండి పాండురంగ, "అయితే మీనాన్న నీకు ఉత్తరమున్నా రాయలే దన్నమాట!" అన్నాడు, ఖాహాటంగా తన ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"ఏమో! మామూలుగా వారం క్రితం ఓ ఉత్తరం వ్రాశాడు. అంతే. విశేషాలేమీ లేవు అందులో. ఏమిటి నువ్వనేది? అంత ఆదుర్దాపడవల్సిన అవసరం ఏమిటిరా?" అన్నాడు, భాస్కర్రావు.

"ఆదుర్దా కేముంది లేకాని..." అంటూ ఆగుతూ, ఎందుకో నసుగులాడుతున్నాడు పాండు.

"చెప్పరా నాయనా." అన్నాడు భాస్కర్రావు తొందర తొందరగా అడుగులు వేస్తూ.

"చెబుతాలే. నీ మొహంచూస్తే, నీకు సంగతి సందర్భాలు తెలిసినట్టూ తెలియనట్టూ అని ఊహించలేక బాధ పడుతున్నాను. నీకు ఏమీ తెలియనట్టే అనుకుని చెప్పమంటావా?" అన్నాడు సందిగ్ధావస్థలో ఉన్న పాండు.

"నువ్వు చెబితే చెప్పు లేకపోతే లేదు. నాకు తగని ఆకలిగా వుంది. మొట్టమొదట ఓ హోటలుకు వెళ్ళి ఆత్మారాముణ్ణి సంతృప్తి పరిచాక నీ మర్మగాథ వింటాను. పదు" అంటూ భాస్కర్రావు బ్రిడ్జిదిగి, రిక్షా వాళ్లు పిలుస్తున్నా వినిపించుకోకుండా, తొందర తొందరగా నడవసాగాడు, ఒక చేత్తో పాండురంగని తనతో బాటే లాక్కుపోతూ. అతడు, కాలేజి బలప్రదర్శనాల్లో రెండో బహుమతి పొందిన వ్యాయామ విద్యార్థి. పాండురంగ కేమీ తోచటం లేదు. అతడు చాలా సందిగ్ధంలో పడ్డాడు. ఇతనికి, ఆ సంగతి తెలియనే తెలియదా? ఎంచేత? వాళ్ళనాన్న వీడికి ఓ ముక్క రాయకుండా వున్నాడా? అయినా,...అతని ఆలోచనలు తెగిపోయినాయి. భాస్కర్రావు గాంధీ నగర్ కి దారితీసి, కాలవవంతెన దాటి ఒక హోటల్లో అడుగు పెట్టాడు.

హోటల్లోకి వెళ్తూనే, "పాండు, నువ్విక్కడ కుర్చో. నేను మొహం కడుక్కొస్తాను." అని అతన్ని బయటే వుంచి, లోపలికి వెళ్లాడు. పాండురంగ ఏ విషయం ప్రస్తావిస్తాడో అన్న ఆదుర్దా ఏమాత్రం కలగలేదు అతడికి. దానికి అవకాశమే లేకపోయింది. ఐదు నిమిషాలకల్లా అతడు చేతి రుమాలుతో మొహం తుడుచుకుంటూ బైటికివచ్చి తన మిత్రుని వీపు చరిచాడు.

ఇంతవరకూ పరధ్యానంగావున్న పాండురంగ ఉలిక్కిపడి పక్కకి తిరిగాడు. భాస్కర్రావు నవ్వుతున్నాడు అమాయకంగా. "రావోయ్, లోపలికి. కాఫీ తాగుదాం" అంటూ అతను తన స్నేహితుని లోపలికి లాక్కుపోయ్యాడు. పాండురంగ ఆలోచిస్తూ ఒక బల్ల ముందు కుర్చీలో కూలబడ్డాడు. ఎదురుగా భాస్కర్రావు కూర్చున్నాడు.

రెండు ప్లేట్లు ఇడ్లీకి ఆర్డరిచ్చి "ఏదో విశేషం అన్నావుగదూ ఇందాక? ఏమిటది? ఇప్పుడు చెప్పు నిదానంగా. తింటూ వింటాను" అన్నాడు భాస్కర్రావు.

"అయితే నీకు అసలేమీ తెలియదన్నమాట!"

"చెప్పరా చంపక. నా కేదీ తెలియదంటున్నానుగా! ఇదిగో - నిన్న రాత్రితో, కాలేజికి శలవు లిచ్చారు. వెంటనే బండెక్కి వచ్చాను. అంతకంటే నా కింకేమీ తెలియదు." అన్నాడతను, వేడి ఇడ్లీ పచ్చడిలో నంజుతూ.

"ఏముంది? మీ నాయన పెళ్ళిచేసుకున్నాడు నిన్న" అన్నాడు పాండురంగ, వూపిరి బిగబట్టి; అతనింకా ఇడ్లీ తినటానికి ఉపక్రమించలేదు.

భాస్కర్రావు, ఇడ్లీ తింటూ తింటూ పకపక నవ్వాడు. "ఇదిట్రా నువ్వు చెప్పే కబురు? మా నాయనకి పెళ్ళా?...ఛా! ఛా! పరాచకాలాడకు...తిను తిను, ఇడ్లీ చల్లారిపోతోంది."

పాండురంగ, చాలా సీరియస్ గా, ఇడ్లీ తినకుండానే, "అరే నేను అబద్ధమాడుతున్నాననా నీ వుద్దేశం? నిన్న రాత్రి 11 గంటల 40 నిమిషాల సుముహూర్తంలో మీ నాయన, పెద్దల సమక్షంలో పెళ్ళి చేసుకున్నాడు. ఇదిగో సాక్ష్యం కావలిస్తే.." అంటూ తన జేబులోనించి, ఓ శుభలేఖ తీసి ఇచ్చాడు.

భాస్కర్రావు చేతిలో వేడి కాఫీగ్లాసు వున్నదన్న స్మరణ కూడా లేకుండా, ఆ పత్రికని అదేపనిగా ఐదారు నిమిషాలు తీవ్రంగా చూశాడు. అతడు దాన్ని చదువుతున్నాడో లేదో, అది అతనికి అర్థమైందో లేదో, పాండురంగకి బోధపడలేదు. భాస్కర్రావు మొహం ఒక క్షణంపాటు వివర్ణమైంది. మరుక్షణమే అతడా దెబ్బ తట్టుకున్నట్టు, శుభలేఖ బల్లమీద పడేసి, కాఫీ అతి ఆప్యాయంగా చప్పరించి తాగసాగాడు. అట్లా మిత్రులిద్దరూ ఐదు నిమిషాలసేపు మాట్లాడుకోకుండా, మౌనంగా వుండిపోయారు. కాఫీ హోటల్లోని విపరీతమైన గందరగోళం, రేడియో పాట, వీధిలో పత్రికలమ్మే కుర్రాళ్ళ కేకలు, అన్నీ వాళ్లకి లీలగా వినిపిస్తున్నాయి. వాళ్ళ మనస్సులలో మాత్రం భయానకమైన ప్రశాంతి ఆవరించింది. వాళ్ళ ఇంద్రియాలన్నీ అంతర్ముఖమై వున్నాయి.

కాఫీ తాగుతున్నాడేగాని భాస్కర్రావు ఆలోచన యావత్తూ తన తండ్రి పెళ్లిమీదే వుంది. ఏమిటిది? పెళ్లివిషయమేమిటి? తనకి ఒక్క ముక్క వ్రాస్తే ఏం పోయింది? అంత వ్యవధి లేకపోయిందా? తన సలహా అడగక్కర్లేకపోవచ్చు. కాని తనకు తెలియచెయ్యటంలో ప్రమాదం ఏముంది? అయినా ఇప్పుడే వీటన్నిటికీ జవాబు చెప్పేవారెవరు? నిదానంగానే ఆలోచించవచ్చు...అతను అలవాటు ప్రకారం, దవ్వన ఆలోచన మానేసి, పాండురంగ వైపు తిరిగాడు. అతని మొహంలో యథా ప్రకారం శాంతి మళ్ళీ నెలకొన్నది.

"పాండూ, మా పిన్ని ఎట్లా వుంటుందో చూశావా నువ్వైనా?" అని అడిగాడు ఆత్రుతగా. పాండురంగ మొదట కొంచెం నిర్ఘాంతపోయినా, వెంటనే కోలుకుని, "ఆమాటకొస్తే పెళ్ళికొత్తసం అంతా, మీ నాన్న నామీద వేశాడులే...పోదాంలే... దారిలో చెబుతా అంతా" అన్నాడు లేస్తూ.

భాస్కర్రావు లేవబోతున్న తన మిత్రుని చెయ్యిపట్టి లాగి కుర్చీలో కూర్చో

---

ఒక కాలేజీ అమ్మాయి తనను వివాహమాడ గోరి వచ్చిన తోటి విద్యార్థితో ఇలా చెప్పింది:

"నేను పెళ్లి చేసుకోబోయే వ్యక్తి చాలా అందంగా ఉండాలి; పాటలు పాడాలి; మంచి వక్త కావాలి; సిగరెట్లు, బీడీలు, చుట్టలు తాగకూడదు. నేను నోరు మూసుకోమన్నప్పుడు మూసుకోవాలి."

విద్యార్థి నిస్పృహతో నిట్టూర్చి అన్నాడు: "అటువంటివాడు దొరకడం కష్టం. శుభ్రమైన రేడియోసెట్టు కొనుక్కోండి."

చేసుతూ, "పెళ్ళేమో అవనే అయిపోయింది; ఇప్పుడేం తొందరమనకు? నిదానంగా వెళ్దాం. అసలు వివరంగా చెప్పవింటాను," అన్నాడు చాలా శాంతంగా.

పాండురంగ నివ్వెరపోయాడు. కాని కూర్చున్నాడు. అవును. అతను చెప్పేది ఎటూ నిజమే. కొంత వివరంగా తెలుసుకుని ఇంటికిపోతే మరీ కొత్తగా వుండక, కాస్త తెరిపిగా వుంటుందికూడా. ఇట్లా ఆలోచిస్తూ, పాండు గొంతు సవరించుకున్నాడు. ఇంతలో సెర్వర్ బిలు ఇచ్చాడు. ఇద్దరు మిత్రులూ, ఐదునిమిషాల పాటు, ఆ బిల్లు ఎవరు తీసుకోవాలని తర్జన భర్జనలో పడి ఒకరిచేతిలోది ఇంకొకరు లాక్కోబోయారు. అది కాస్తా చినిగింది. చివరికి భాస్కర్రావు గెలిచాడు.

"అదికాదు పాండురంగా, ఈ ఆలోచన మానాన్నకి ఎప్పుడు కలిగిందంటావు?" అని ఉపక్రమించాడు అతడే.

"వారంముందు. అంతా చకచకా అయిపోయింది. ఈ ఆలోచన ఎట్లా వొచ్చిందో నేను ఊహించలేకపోతున్నాను. నిన్నటి తెల్లారు జామకల్లా, పెళ్ళివారంతా ఇక్కడికి వొచ్చారు. రాత్రి లగ్నం; ఈపూట, పెళ్ళికూతురు తప్ప అందరూ వెళ్ళిపోయారు కూడాను. నేను, వాళ్ళను పాసెంజరుకి పంపించి, రిక్షావాళ్ళకి కూలీ ఇచ్చిపంపి తిరిగి స్టేషనులోకి వస్తుంటే నువ్వెదురైనావు"

"అయితే, వాళ్ళది ఏవూరు"

"ముహూర్తపత్రికలో చూడలేదు?"

"నువ్వు చెబుదూ"

"బాపట్ల తాలూకా, లంకపల్లి గ్రామంట"

"అదిసరేగాని, మా పిన్ని ఎట్లావుందో చెప్పనేలేదు నువ్వు" భాస్కర్రావు అతి సహజంగా అడిగాడీ ప్రశ్న

పాండురంగ కాస్త ఆలోచించాడు. ఆమెని అభివర్ణించటం శక్యంకాదు; ఆమె, ఈ ప్రశ్నించేవాడి తండ్రికి భార్య... వాడెంత స్నేహితుడైనా, ఏమైనా అనుకోగలడు. ఏమనుకుంటాడు? ఏదో కాస్త సామాన్యంగా చెపితే సరిపోతుంది; "ఎట్లా వుందా?...ఆమెకేం? బాగానే వుంది. చామనచాయ. కాస్త పొడుగే...అంతే" అన్నాడు పాండురంగ.

భాస్కర్రావు మౌనంగా వూహించటానికి ప్రయత్నిస్తున్నాడు తన పినతల్లిని; అతని మనోనేత్రంముందు తన తల్లి రూపు అగుపించింది మొదట. ఆమె 40 ఏళ్ళ సుమంగళి; పెద్ద ముత్తయిదువు; లక్ష్మిలాగ ఆ యింట్లో మసులుతూ, కళకళలాడుతూ వుండేది. ఆమె రూపం పక్కనే ఇప్పుడు ఇంకో తల్లికి ఓ స్థానం ఇవ్వటానికి భాస్కర్రావు ప్రయత్నిస్తున్నాడు. తల్లి సీతమ్మగారి ప్రేమవాత్సల్యాలు అతనికి బాగా గుర్తే; ఆమె చనిపోయి ఇంకా సరిగ్గా రెండేళ్ళన్నా కాలేదు; తన కింకా ఆమెను గురించిన జ్ఞాపకం అతి గాఢంగా వుంది; నాన్న మర్చిపోయాడా ఆమెను అప్పుడే? 30 ఏళ్లు దాదాపు సాహచర్యం చేసిన తన ఇల్లాలి జ్ఞాపకం ఇంతలోనే భర్తకి మాసిపోతుందా?...అయినా అవన్నీ ఇప్పుడు అనవసరం; ఈ కొత్త వ్యక్తిసంగతేమిటి? ఆమెకి తను ఇవ్వగలిగే స్థానం ఎలాంటిది? సవతితల్లుల్ని గురించి అతనికి చాలా తెలుసు కాని ఆ కథల్లో మల్లే ఈమె తనను బాధపెట్టే స్థితిలో...తను ఎన్నడూ వుండడు.. భాస్కర్రావు పాండునుచూసి సంబోధించి, "అయితే మా పిన్నికి ఎన్నేళ్లుంటాయి అంటావు?" అని అడిగాడు.

ఇది క్లిష్టమైన ప్రశ్న. పాండురంగ సూటిగా తన మిత్రుని మొహంలోకి చూడక, కాఫీహోటల్ గోడకివున్న సినిమా పోస్టరులో బొమ్మకేసిచూస్తూ, "20 ఏళ్లుంటాయి అనుకున్నాను నేను" అన్నాడు కొంచెం తికమకతో.

భాస్కర్రావు నిదానంగా లేచాడు. అతనికి ఏ సంశయమూ, ఏ ద్వేషమూ ఏ ఇతర ఆలోచనా లేవు. తనకు అపరిచితవ్యక్తి ఐన పిన్ని, లీలగా అతనికి గోచరిస్తోంది. ఇరవై ఏళ్ల వయస్సులో పొడుగ్గా, సన్నగా, చామనచాయగా, తనకు తల్లిలేని లోటు కనపడకుండా వాత్సల్యంతో ఆదరిస్తూ,... అతని ఆలోచన అంతకన్న ఎక్కువపోవటం లేదు.

"రావెళ్దాం. దంపతులకు ఏదైనా బహుమతి కొనుక్కుపోదాం." అంటూ బయల్దేరాడు ఆ యువకుడు. పాండురంగ వెనకాలే వెళ్ళాడు.

## 2

మొగల్రాజపురం ప్రవేశించే మొదట్లోనే ఒక పెద్దలోగిలి ముందు పెళ్ళిపందిరి కనపడుతోంది. పందిరి నాలుగువేపులా మామిడాకులు వాడిపోయి కనపడుతున్నాయి. పందిరికింద అక్కడ కాస్తపసుపు, ఇక్కడ కాస్త కుంకుమ, అక్కడో అక్షింత, ఇక్కడో అక్షింత పడివుండి, ఆ పెళ్ళి జరిగిన కళను, బాగా జ్ఞప్తికి తెస్తున్నాయి. పందిరివెనక పెద్ద లోగిలి. అప్పుడు ఉదయం 8 గంటలవుతుంది. పచ్చని ఎండ పందిర్లో చుక్కలుచుక్కలుగా, చారలు చారలుగా తాటాకులగుండా పడుతోంది, విచిత్రంగా అందంగా. భద్రయ్యగారు, జరీ అంచు ధోవతి కట్టుకుని, పైనో టర్కీటవల్ వేసుకుని, పడకుర్చీలో పడుకుని పేపరు చదువుతున్నాడు ఇంటివరండాలో. ఆయన్ని చూస్తే 40, 42 ఏళ్ళ వయస్సు ఉంటుం దనిపిస్తుంది. యథార్థంగా 50 పైచిలుకు ఉంటుంది. తల సగం నెరిసింది. దట్టమైన మీసంగూడా నెరిసిపోయింది. వెడల్పాటి కోలమొహం మీద ముడతలు పడ్డాయి. ఆయన శరీరం దృఢంగా వుంది; ఎర్రని నిమ్మపండువంటి శరీరచ్ఛాయ. ఎప్పుడూ నవ్వుతూవుండే ప్రకృతి

ఆయనది అసలు నాగాయిలంక. పూర్వార్జితం పదెకరాల సుక్షేత్రమైన మాగాణీ భూమి వుంది. నాగాయిలంకలో ఓ పెద్ద ఇల్లుకూడా వుంది. దాన్నెవరికో అద్దె

# ★ మంచీ-చెడూ ★

ఇచ్చాడు. బెజవాడ వచ్చేవరకు ఆయన మామూలు రైతు. పొలంపని యావత్తు ఆయనకు కరతలామలకమే. కాని, పెళ్లయిన పదేళ్ళకల్లా ఆయనికి ఓ స్నేహితుడు దొరికాడు. అతని ఉపదేశఫలితంగా, భద్రయ్యగారు తనదగ్గిర నిలవవున్న రొఖ్ఖం పెట్టి వేరుశెనగ వ్యాపారంలోకి దిగాడు. ఆ స్నేహితుడు చాకచక్యంగా వ్యవహరించి లాభం చూపెట్టాడు. వ్యాపారంలో రుచి మరగటంతోటే భద్రయ్యగారు సకుటుంబంగా బెజవాడవొచ్చి స్థిరపడి పొయ్యాడు. వేరుశెనగ వ్యాపారంలోలాగే ఆయన చెయ్యిపెట్టిన ప్రతివ్యాపారంలో బంగారం కురిసింది. అది ఆయన వ్యక్తిత్వప్రభావం మాత్రమే కాదు, ఆ స్నేహితుని వ్యాపారదక్షతకు చిహ్నంగూడా. ఆ స్నేహితునికి బెజవాడలో కొట్లు, ఇళ్లు వున్నాయి. ఆయన పాత బెజవాడలోనే కాపరం వున్నాడు. ఆయన పేరు సుదర్శనం. సుదర్శనం బాగా నల్లగా నిగనిగలాడుతూ వెంకటేశ్వర సాక్షాత్కారం అయినట్టుంటాడు. తిగ్గట్టు నుదుట మెరిసే నామాలు దిద్దుతాడు. గుణాలలోగూడా వెంకటేశ్వర స్వామికేమీ తీసిపోడు. ఆయన చేతికి అందిన జుట్టు మొదలంటా క్షవరం. నీఅంతవాడు లేడన్నవాడికి అడిగిందల్లా ఇచ్చేపాటి కుబేరుడు. ఆయనదీ నాగాయిలంకే. చిన్నదుకాణంతో ప్రారంభించి, ఈరోజున బెజవాడలో నాలుగైదు ఇళ్ళు కట్టాడు. అద్దెలే 2000 రూ వస్తాయి ఏటా. నాగాయిలంకలో పొలంగూడా వుంది. ఇంకా వ్యాపారం లక్ష్మీకరంగా సాగుతోంది. భద్రయ్యగారి వ్యాపారాన్ని చూసిపెట్టేదీయనే. ఈయన మాటంటే భద్రయ్యగారికి వేదవాక్కు.

భద్రయ్యగారు భార్య గతించిన రెండేళ్ల వరకూ ఇక తనకు ఇహసౌఖ్యాల అవసరం తీరిపోయినట్టు, సన్యాసమే తరవాయి అన్నట్టు కాలం గడుపుతూ వచ్చాడు సుదర్శనంగారు, మొదట్నించీ భద్రయ్యగారికి అన్ని సలహాలూ చెప్పేనట్టు,- భార్య పోయాక ఒకనాడు ఆయనకి, "తిరిగీ పెళ్లి చేసుకోండి! నేను చేసుకోలా మూడో పెళ్ళి! తప్పేంలేదు" అన్నాడు చేతులు తిప్పుతూ. వేళ్ళ ఉంగరాలు మెరుస్తున్నాయి, బంగారపు కడియాలు మిరుమిట్లు గొల్పుతున్నాయి.

భద్రయ్యగారు పెదవి విరిచి, "నాకెందుకోయ్ పెళ్ళి! ఇంక ఏం మిగిలివున్నాయి నే ననుభవించవల్సిన సౌఖ్యాలు! అబ్బాయి చేతి కక్కరకొచ్చాడాయె. పోదూ" అని నానుడుగా అన్నాడు. సుదర్శనం ఓ సలహా ఇచ్చాడూ అంటే అది లాభించే వ్యవహారంగానే ఉంటుందని ఆయన దృఢనమ్మకం. ఎట్లాగో చివరికి వొప్పుకున్నాడు. ఆడదిక్కులేని సంసారం చుక్కానిలేని పడవ వంటదని సుదర్శనం వాదించి నెగ్గాడు దీనికి ఇంకో కారణం కూడా లేకపోలేదు; భద్రయ్యగారి శరీరంలో ఇంకా పటుత్వం నశించలేదు. ఆయనలో ఐహిక సుఖాల స్వప్నాలింకా లీలగా మిగిలివున్నాయేమో కూడా వాట్ని ఇన్నాళ్లుగా ఆయన తర్కప్రభావంతో అణిచిపెట్టి వుంచాడు. తన కాబొయ్యే వధువును సుదర్శనం, వర్ణించేసరికి, చాపల్యం పుట్టుకొచ్చింది ఆయనకు. చల్లబడిపోయిన రక్తం కొంచెం వేడెక్కింది. పురి సడలిన నరాలు బిగిశాయి తల వూపాడు.

ఇంగులో, సుదర్శనంగారి స్వార్థంకూడా వుంది. స్వార్థం లేకండా ఆయన ఏపనైనా చేస్తాడనే మాటకల్ల. బాపట్ల తాలూకాలో ఆయన దూరపుబంధువు ఒకాయన ఐదుగురు ఆడపిల్లల్ని గని, నలుగురికి ఎట్లాగో తూతూ మంత్రంగా పెళ్లి చేసి, బొచ్చె చేతికి తెచ్చుకున్నాడు ఐదోపిల్ల ఇరవయ్యోపడిలో అడుగుపెట్టి ఆయనకి గొప్ప భారమై కూచుంది; ఆమెకి పెళ్ళి చెయ్యటానికి ఐదేళ్ళనించీ ఎంతో ప్రయత్నంచేసి విఫలుడైపోయాడా అభాగ్యుడు. వరకట్నాలు పనికిరావని యువకులందరూ మీటింగుల్లో ఘోషిస్తే ఘోషించవచ్చుగాక, క్రియాంశకు వచ్చేసరికి అవన్నీ, వట్టి ఆదర్శాలుగానే మిగిలిపొయ్యేవి. రూపాయి ముందు ఆదర్శాలన్నీ దుమ్ము. అట్లాంటి ఆదర్శప్రాయులైన యువకులూ, వారి తల్లిదండ్రులూ, వెంకటయ్యగారి ఐదోకూతురు, పద్మను కనీసం సంచీడు రొఖ్ఖం లేనిదే పెళ్ళి చేసుకోటానికి సుతరామూ అంగీకరించారు కాదు. పద్మ అందంగా, వుంటుంది; బాగా పాడుతుందికూడా. సెకండరీ స్కూలులో కొంతకాలం చదివింది; ఇంటిపనులన్నీ చక్కగా చెయ్యగలదు. అన్నీ బాగానే వున్నాయి. అయితే ఏం? ఆమె తండ్రికి డబ్బులేకపోవటం మూలంగా ఆమెని ఏ యువకుడుగాని పాణిగ్రహణం చేసుకోటానికి ససేమిరా అంగీకరించకుండా వున్నారు.

వెంకటయ్యగారు ప్రాణం విసిగి పుడ

ర్శనంగార్ని కలుసుకున్నాడు, ఆయన సలహా ఏమిటని తెలుసుకోగలందులకు. అసలు ఆయన అభిప్రాయం ఏమంటే, పిల్లదాన్ని ట్రెయినింగ్ స్కూలుకు పంపించి చదివిస్తే, పెళ్ళికాకపోతే పోయిరీ తన పొట్ట తాను పోసుకుంటుంది గదా అని. దానికి కొస్త అర్థబలంవున్న సుదర్శనంగారి సహాయం ఎంతో అవసరం అని ఆలోచించి, ఆయన సుదర్శనంగార్ని కలుసుకున్నాడు.

సుదర్శనంగారు తన బంధువూ, వృద్ధుడూ అయిన వెంకటయ్యగారి సొదంతా విని పెద్దగా వెకిలిగానవ్వాడు. "ఇరవైయేళ్లు వచ్చి ఇంక చదువుకుని మేస్టరీ చేస్తుందనేనా మీ అమ్మాయి; పొరపాటు, పొరపాటు. ఈడు ముదిరిపోకముందే పెళ్ళిచేసెయ్యవల్సింది. ఇప్పుడు మాత్రం ఏం మునిగిపోయింది వెంకటయ్యా! నేను పెళ్ళికి ఏర్పాటుచేస్తాలే. దిగులుపడకు ఇన్నాళ్ళూ దీన్నిగురించి ఒక్కమాట నాతో చెప్పావు కాదేం?" అని ఓదార్చి, పైగా, "అమ్మాయిని, తీసుకొచ్చిమాయింట్లో వదిలి పెట్టివెళ్లు తర్వాత వ్యవహారం నేను చూస్తాను వ్వేటు తిరిగి జోర్తుతిప్పేశావు; నీకూ నీ భార్యకీ ఇకముందు కాలం ఎట్లా వెళుంది? ఆలోచించావా కొస్తయినా? పెద్దతనంలో, ఆస్తి లేక, సంపాయించి పెట్టటానికి కొడుకూ లేక ఎట్లాబతుకుతావో! నీకు రెండురకాలు కలిసి వచ్చేట్టు నేనుచేస్తాను పెళ్ళి వెంటనే అమ్మాయిని ఇక్కడకు తీసుకురా" అని చాలా ఉదారంగా పదిరూపాయలు బదులుకూడా ఇచ్చిపంపాడు. ఆ క్షణాన ఆయన ఆంతర్యంలో భద్రయ్యగారు కనిపించాడు. భేష్ బాగుంది అనుకున్నాడు. ఇందులో తనకేం ఒరుగుతుంది? అది వేరే విషయం; ఇరుపక్షాలవారికీ తను ఉపకారిగా కనిపిస్తాడు. ఆ తర్వాత లాభం సంగతి ఆలోచించవచ్చు.

అయితే సుదర్శనంగారి వివేకం ఈ వ్యవహారంలోని మంచి చెడ్డలను పూర్తిగా త్రాసులో పెట్టి తూచినట్టు ఊహించి నిర్ధరించేసింది అప్పటికప్పుడే. భద్రయ్యగారు కలకాలం స్నేహితుడుగానే ఉండటం మాత్రం చాలదు; బంధువుగూడా అయితే ఎంతో సుఖవు తన కింకో ఆశ ఎప్పణ్ణించో వుంది; దాన్ని బైటపెట్టటానికి తగినంత ఆస్కారం పలుకుబడి ఇప్పటికే వ్యాపారరీత్యా, ఆర్థిక ఆధిక్యత రీత్యా వున్నప్పటికిన్నీ, బంధువూ అనుకుంటూ ఇంకో కొత్తపలుకుబడి సంపాదించటం ఎంతయినా అవసరమే—అందులో తనకేమీ 'రిస్కు' లేకండా...

ఈ రకం అభిప్రాయాల ప్రకారం ఏర్పరుచుకున్న ప్రణాళికను అనుసరించి సుదర్శనంగారు భద్రయ్యగారికి చేసిన వుపదేశం ఫలిచేసింది. ఆయన పలుకుబడి చక్కగా వుపయోగించింది; అయితే ఈ ఉభయపక్షాలలోనూ, ఒక్క వ్యక్తిమాత్రం దీనికి మనసా వ్యతిరేకం; లోలోపల శుద్ధ వ్యతిరేకం; పైకి పరిస్థితుల ప్రభావంవల్ల సహజంగా ఏ భావమూ గోచరించని మౌనం; అదే అంగీకార సూచకంగా స్వీకరించబడింది అందరిచేతా. ఆమె పద్మ; పెళ్ళి అనే మహత్తర సంఘటనలో ఆమె రెండవపాత్ర స్వీకరించాలి స్వీకరించటంలో ఆమె కేమీ అభ్యంతరం లేదు; ఆమె స్వభావాలకూ ఆమె ఊహాలకూ అందిన పెళ్ళికాదు ఇది. అయితే ఏంచేస్తుంది? పరిస్థితులు అలావున్నాయి. తల్లి కంట తడిపెట్టింది; తండ్రి చాలా విరక్తిగా మాట్లాడాడు ఆమె మనస్సు సంఘర్షణలో పడి చివరికి మెతకిచ్చింది; కరుడుకట్టిపోయింది; తుపాను అంతరించి వినాశకరమైన హృదయవిదారకమైన శాంతి ఆమె మనస్సులో నెలకొన్నది.

ఆమె బెజవాడలో దిగి, పెళ్ళివారం వుందనగా సుదర్శనంగారి 'సుఖవిలాసం'లో అడుగుపెట్టింది. చుట్టూ చూసింది; సుఖవిలాసం సాక్షాత్తు సుఖాల పుట్టిల్లుగా వుంది. ఎంత గొప్పఇల్లు! మూడంతస్తులుంది. షరాబు దుకాణాలు, మార్వాడీల బంగారం వెండి కొట్లూదాటి, చిల్లర కొట్ల వరసలనూ, కాఫీహోటళ్ళనూదాటి, పూలచౌకుకు అవతల, దేవాలయానికి ఎడంవేపు గంభీరంగా నిలబడివున్నదా భవనం; బైటికి అదేమంత డాబు సరిగా కనపడకపోవచ్చు. లోపల అడుగుపెట్టిన క్షణంలోనే అర్థమౌతుంది, అది ఎంత సిరిసంపదలతో తులతూగుతూ ఉందో!

ఆ యింటి కిటికీలకు పైవేపు అర్థగజం మేర, లేత నారింజరంగు అద్దాలు అమర్చబడి, ఆహ్లాదకరమైన కాంతి పగల్లల్లా లోపలికి ప్రసరిస్తూ మనోజ్ఞంగా వుంటుంది; గాలి ధారాళంగా చలగా వింత వాసనల్ని మోసుకొస్తూ వుంటుంది. బెజవాడనగరపు దారుణమైన సందడిలో నడిమిగావున్నా గట్టిఇల్లు కనక, ఆ శబ్దాలు వినిపించవు అవి. మెల్లిగా చిన్న ట్యూనులో,



**తులసిపూజ** (కాగితాల కత్తిరింపు చిత్రం) ఏ. వి. యస్. ఆర్. జోస్యులు

## ★ మంచీ - చెడూ ★

మెడ్రాసో, విజయవాడో, లోపలహాల్లో రేడియోనించి పాటలు వినిపిస్తూ మనసుకు పట్టిన తుప్పును దిగుళ్లనూ వొదిలిస్తూ వుంటాయి. కొయ్యసామాన్లన్నీ ఖరీదైనవి, నున్నగా అందంగా వున్నాయి.

పద్మ లోపలికి వెళ్లబొయ్యేముందే, సుదర్శనంగారు చక్కగా నామాలు దిద్ది, వడిగా, పట్టు పంచె కట్టుకుని, అప్పుడే పూజనించి లేచి వచ్చినట్టున్నాడు, ఎదురు వచ్చి ఆమెని కులాసాగా ఆహ్వానించాడు. ఆయన మొహంమీద ఎంతో ఆప్యాయత, ఎదటివార్ని ఇట్టే ఆకర్షించే చిరునవ్వూ ఎల్లప్పుడూ వుంటాయి. అది ఇప్పుడు మరింత కాంతివంతంగా ప్రకాశిస్తోంది.

"రాఅమ్మా, నాన్నగారేరీ, అమ్మగారు కూడా వచ్చారా?" అని అడుగుతూ లోపలికి దారితీశాడాయన.

"వెనకాలే వస్తున్నారు బాబాయి" అంది పద్మ. ఆమె తండ్రి బైటబండివాడికి చిల్లర డబ్బులిచ్చి రావటానికి ఆలశ్యం అయినట్టుంది. ఇంతలో వాళ్ళిద్దరూ లోపలికి వచ్చారు. అందరూ విశాలమైనహాలుగుండా లోపలికి వెళ్ళారు. గోడలన్నీ ఆకుపచ్చని రంగుతో ఆహాలు చాలా శాంతిగా కనిపిస్తోంది. గోడలకి అక్కడో పఠం ఇక్కడో పఠం వేళ్ళాడుతున్నాయి. వాటినిబట్టి సుదర్శనంగారి అభిరుచి నిర్ణయించటం కష్టసాధ్యం; గాంధీ, పొట్టి శ్రీరాములుగార్ల చిత్రాలు, వాటిమధ్య సత్యనారాయణస్వామి పెద్దపఠం; ఎదురుగా చిన్న చిన్న సినిమాతారల చిత్రాలు! వాళ్ల సంభాషణ యోగక్షేమాలు ఇతర చిల్లరవిషయాలగురించే సాగాయి. కాబోయ్యే పెళ్ళిగురించి ఎందుకనో పద్మసమక్షంలో వివరంగా మాట్లాడ్డానికి అందరూ జంకుతున్నారు; వ్యక్తతవొచ్చిన పిల్ల; 50 ఏళ్ల పైపడ్డవాడికి రెండో సంబంధం ఇచ్చి పెళ్ళి చెయ్యటం అనేది ఒక సమస్య. ఆమె ప్రస్తుతం అంగీకరించినట్టే కనపడుతున్నది. లోలోపల ఆమెలో రగుల్తున్న అగ్నికణం ఏతుణాన జ్వాలలై, తిరగబడుతుందో! పెళ్ళికొడుకును ఈలోగా ఒకసారి ఆమెకు పరిచయం చెయ్యటం చాలా అవరం; ఆమెనుగూడా భద్రయ్యగారు ఒకసారిచూడాలి చూస్తే ఇక ఈ సంబంధం స్థిరపడి పోయినట్టే.

సుదర్శనంగారు అతిథులకు కాఫీ టిఫిన్లు తెప్పించారు.

పద్మ తిరిగి ఆలోచిస్తోంది. కాఫీ పొగ లేస్తోంది. తన జీవిత మాధుర్యం అట్లా ఎగిరిపోతున్నట్టు కనిపిస్తోంది ఆమెకి. రేడియోలో 'పలుకవదేమి నా దైవమా' అనే కృతి సన్నగా ఆ పట్నవాసపు సందడినీ ఆమెచుట్టూ కూర్చుని, మౌనంగా ఆమె భవిష్యత్తును నిర్ణయిస్తున్న పెద్దల ఆలోచనల కప్పుల గలగలను అధిగమించి ఆమె చెవులకు సోకుతోంది.

ఆమె తల పైకెత్తి చుట్టూ చూస్తోంది. హాలుపైకప్పు నాలుగువేపులా ఆకుపచ్చని 'వెంటిలేటర్' అద్దాలగుండా సూర్యకాంతి, నిశితమైన గాఢమైన వర్ణవైచిత్రిని ప్రదర్శిస్తోంది. ఇంత పెద్దఇంట్లో, జీవం నివశిస్తున్న చిహ్నంగా, ఒక్క సుదర్శనంగారేనా ఉన్నది? మరెవరూ లేరా? అనుకుంది - ఆమె.

సుదర్శనంగారు పెళ్లికొడుకు సాయంకాలం 3 గంటలకు వస్తాడు అని చెబుతున్నాడు వెంకటయ్యగారితో;

పద్మ వూహించసాగింది; ఎట్లా వుంటాడో కాబోయ్యే భర్త? అని. [ఇంకావుంది]



## తొలి ప్రొద్దు

—ఫొటో: పి. వీరయ్య, సికింద్రాబాద్

క్ష్ణగా చూసి "ఒరబ్బాయిల్లాయినా? చీకటడిపోయింది పొండి ఇళ్ళకిపొండి" అన్నాడు వాళ్ళామాటలు విన్నట్టుగా లేదు ఎవరో మనిషి వచ్చేడని చూసినట్టుగానే లేదు ముసలాయన దగ్గుకొంటూ వెళ్ళి చంకనున్న గోనె విప్పి అమ్మవారి గుడిపక్క చప్టామీద పరుచుకొని కళ్ళు కొవ్వకుండా నెమ్మదిగా జాగ్రత్తగా పడుకున్నాడు బొంబాయి బస్సులనేవి ఉంటాయని ముసలాయనకి తెలీదు

* * *

చంద్రుణ్ని చుక్కల్ని కొనుక్కోవక్కర్లేదు బొంబాయి బస్సుల్ని మాత్రం కొనుక్కోవాలి

అయితే ఆ బొంబాయి బస్సు ఎర్రసుబ్బడికి కొనకుండానే వచ్చింది మొన్నీమధ్య సుబ్బడి బావ—అప్ప పెనిమిటి—బొంబాయి నుంచి బండీ దిగేడు దిగి ఇంట్లో అడుగు పెడుతూనే, పెట్టె తెరిచి, పైకితీసి బహూకరించేడు, - మరదలి కొక 'సాటిన్ఫ్రాకు' బావమరది కొక 'బొంబాయి బస్సూ'ను

బొమ్మనీ, బొమ్మని తెచ్చిన బావనీ, బావని పెళ్ళాడిన అప్పనీ చూసుకొని బ్రహ్మానంద భరితుడైన ఎర్రసుబ్బడు ఇంట్లో అటూ ఇటూ ఎగిరెగిరి ఎగిరెగిరి తరువాత ఒక్క దూకు దూకేడు నల్లగోపాలం ఇంటికి

ఎదటింటి ఎంకు వెంకడు గాడు, పక్కింటి దుక్క బుజ్జాయిగాడు, వెనకింటి దొంగ బాబిగాడు, నూతి పక్కింట్లో నూకాజిడ్డు గాడు, జామిచెట్టింట్లో జామకాల సీత— వీళ్ళంతా సుబ్బడి స్నేహితులే కాని ఆ బొమ్మని వాళ్ళెవరికీ చూపించకుండా, మాటైనా, రామబాణంలా ఆ నల్లగోపాలం ఇంటికే ఎర్రసుబ్బడు ముందుగా పరిగెత్తడానికి కారణం?

వాళ్ళిద్దరూ ప్రాణస్నేహితులని ఆ వీధిలో అందరికీ తెలుసు సుబ్బడి తండ్రికీ, గోపాలం తండ్రికీ ఒకే "మఠ"లో నౌఖరీ ఆ తండ్రు లిద్దరూ మస్తాకి తాగడానికి కూడా కలిసే వెళ్తూంటారు వాళ్ళ ఇళ్ళు కొంచెం దూరదూరంగా ఉన్నా ఒకే వీధిలో ఉన్నాయి వారి భార్యలు అప్పచెప్పులకి ఒకరిళ్ళ కొకరు వెళ్లినప్పుడు ఒకరి దెబ్బ లొకరికి చూపించుకోడం వారికి మామూలు.

గోపాలానికీ సుబ్బడికీ ఇంచుమించు ఒకే వయసు వాళ్ళిద్దరిదీ ఒకే స్కూల్లో ఒకే క్లాసు క్లాసుకి ఎప్పుడూ ఆలస్యంగా వెళ్ళేది వాళ్లిద్దరే ఒకట్లో ఎక్కం, రెండో ఎక్కం, పదో ఎక్కం తప్పించి మరే ఒక్క ఎక్కం కూడా 'రానివాళ్లు ఆ క్లాసుకి వాళ్ళిద్దరే అల్లరి చేసి మాస్టారి చేత జోడాగా దెబ్బలు తినేదీ వాళ్ళిద్దరే

పెద్దలైనా, పిన్నలైనా ఇటువంటి పరిస్థితుల్లో స్నేహితులవక తప్పరు.

కాని, ఓ రామయ్యగారికి జామిచెట్టు



# ఇద్దరు పిల్లలు



లేకపోయినట్లయితే నా శ్రీధరూ ప్రాణ స్నేహితులవక పోయేవారేమో.

స్కూలుకిదగ్గర్లో రామయ్యగారి ఇల్లుంది. ఇంటిపక్క రామయ్యగారి జామిచెట్టుంది. జామిచెట్టుమీద రామయ్యగారి పంచ ప్రాణాలూ ఉంటాయి.

కలకల్లాడుతూ కల్పవృక్షంలా కనిపించే జామిచెట్టునిండా నవనవలాడుతూ పళ్లుపళ్లు ఎన్నో పళ్లు ఉన్నప్పటికీ, బడిపిల్లలకి అదొక వెల్కమ్ అడ్రస్‌లా ఉన్నప్పటికీ, ఏ ఒక్క బడిపిల్లడూ కూడా ఆ పళ్ళని చూసి ఆనందించడంతప్ప తిని ఆనందించక పోడానికి రెండు కారణాలున్నాయి.

ఒకటి: రామయ్యగారి తోటమాలి యమకింకరుళ్ళా ఉండడం.

రెండు: రామయ్యగారు కాలయముళ్లా ఉండడం.

నల్లగోపాలంమాత్రం చూసిచూసి ఓరోజున ధైర్యం చేసేసేడు.

దిగువని ఎర్రసుబ్బడు రాలేపళ్ళని జోరు జోరుగా ఏరుతున్నాడు. పైనుంచి నల్ల గోపాలం పళ్ళని తెంపి పారేస్తున్నాడు. ఇద్దరూకూడా యముడూ, కింకరుడూ ఇంట్లోంచి వెళ్లడమే చూసేరుకాని రావడం గమనించలేదు. వాళ్లుమాత్రం వస్తూనే చూసింది వీళ్లనే. వస్తూనే చెరొకళ్లీ పట్టుకొని భావగొట్టి చెవులు మూసేరు. ఆదినం రామయ్యగారికీ రావణాసురుడికీ తేడా తొమ్మిదితలల్లో మాత్రం.

కాలయముడు; కల్పవృక్షం; చావు దెబ్బలు.

నల్లగోపాలం, ఎర్రసుబ్బడూ ప్రాణ స్నేహితులవడానికి అవీ కారణాలు. అవి మాత్రం సిమెంటు కాంక్రీటువంటి కారణాలు.

ఈ స్నేహితులకి—

బటానీలు, పకోడీలు, ఉసిరికాయలు, రేగుపళ్లు, వేయిసెనగలు, గాలిపడగలు, పలక పుల్లలు, రబ్బర్లు, తెల్లకాయితాలు, బొంగరాలు, గోటీకాయలు వగైరాలు - అన్నీ కూడా వారి సమిష్టి ఆస్తులు. అవి ఒకరికి ఉన్నట్లయితే రెండోవారిక్కూడా ఉన్నట్టే లెక్క.

బొమ్మ బస్సుని చూసినప్పుడు కూడా సుబ్బడెంత సంతోషించేడో గోపాలం అంతేగానూ సంతోషించేడు.

చాలా చిన్నది బొంబాయిబస్సు. ఎర్రటి రంగుతో మెరుస్తూంది. అంత చిన్న బొమ్మ లోనూ రెండు అంతస్తులు కనిపించేలా తయారు చేసేరు. డ్రైవరు టిక్ డ్రైవరు. కిటికీలదగ్గర ప్రయాణీకులూ, గుమ్మందగ్గర కండక్టరూ మాత్రం రంగు రేకుమీద రంగుబొమ్మలు. "క్రీ" ఇస్తే బస్సు పరిగెడుతుంది.

"బలే బలే బలేగుందిరా" అన్నాడు నల్ల గోపాలం.

కాని సుబ్బడి వ్యవహారం బలేగా ఉందా?

దీనికి 'క్రీ' ఇలా ఇవ్వాలి. కుడిప్రక్కకి తిప్పాలి. వెనక చక్రాలు గిర్ గిర్ మని తిరక్కుండా ఇలా పట్టుకోవాలి.

అని ఆ బొమ్మకి 'క్రీ' ఎలా ఇవ్వడమో చూపించేడు సుబ్బడు.

ఇలా ఒదలాలి.

బస్సుని ఒదిలేడు.

జరజర శబ్దంచేస్తూ వెళ్లి గోడని గుద్దేసి ఆగిపోయింది బస్సు.

"అడ్డేదీ లేపోతే చాల్దూరం వెళ్తుంది తెల్సా!" అన్నాడు సుబ్బడు;

బస్సుని గోడకి ఇవతలవైపుకి మళ్ళీ తిప్పి వదిలేడు.

జరజరా మళ్ళీ పరిగెత్తింది బస్సు. చివరకి ఆగింది.

దాన్ని చేతిలోకి తీసుకొని చెప్తున్నాడు సుబ్బడు:

చూసేవా, ముందు కూర్చున్నాడు డ్రైవరూ. మా బావా అలాగే కూర్చుంటాడు. మరో తమాషారా, గోపాలం! ఇది మేడ బస్సు. "మనూళ్లో ఇటువంటి దేదీ చూపించు చూదాం!" బొంబాయిలో అన్నీ ఇలాటి బస్సులే. బొంబాయి మా బావతో "నేనూ వెళ్తాను తెల్సా!"

ఆమాటలు చెప్పడంలో, చెప్తూన్నప్పుడు ఆ కళ్లు తిప్పడంలో, ఆ బొమ్మని చేత్తో గట్టిగా పట్టుకోడంలో, 'క్రీ' ఇచ్చి దాన్ని పరిగెత్తించినప్పుడు గోపాలం ఎక్కడ లాక్కుంటాడో అని తనే ముందు పరిగెత్తి దాన్ని తీసి గుండెలకి అదుముకోడంలో, మచ్చుకొక్కసారైనా దాన్ని గోపాలం చేతికి ఇవ్వకపోడంలో—

సుబ్బడి ఉత్సాహమే కాకుండా, "ఇది నాది. దీన్ని నేనే వాడాలి" అనే భావం కూడా వ్యక్తమవుతోంది. కొద్దిసేపట్లో గోపాలానిక్కూడా అంతా స్పష్టమయింది.

"ఈ బొమ్మ వీడు నా కివ్వడు"

అని చాలా ఖచ్చితంగా, రెండు రెళ్లు నాలుగులాగ, సూర్యుడు ఉదయించి అస్తమించుట్లాగ తెలిసింది గోపాలానికి.

"నేనోసారి 'క్రీ' ఇస్తా నిలా ఇవ్వరా" అని అడిగేసేడు.

అప్పుడు సుబ్బడు బస్సుకి 'క్రీ' ఇవ్వబోతున్నాడు. ఇవ్వబోతూ ఆగేడు.

ఇస్తాడా ఇవ్వడా? ఇస్తాడా ఇవ్వడా? ఇస్తాడా ఇవ్వడా?...

'క్రీ' ఇవ్వడం మొదలుపెట్టేడు సుబ్బడు.

"మా బావా...('క్రీ' తిప్పేడు)...మరీ...(మళ్ళీ తిప్పేడు)...మా బావొచ్చి మరీ...(మరోసారి తిప్పేడు)...కోప్పడతాడ్రా..."

అని ఇంకా ఏదో నసిగేడు సుబ్బడు, కరకరమని 'క్రీ' ఇచ్చేస్తూ. సాకులు చెప్తున్నాడు సుబ్బడు!

గోపాలానికి అసహ్యం వేసింది. అసహ్యం వెయ్యదూ?!

"పోన్లేరా ఒద్దులే" అనేశాడు.

గోపాలం ఉత్సాహం అంతా చచ్చింది. ఎందుకు చావదు? కాని సుబ్బడి వ్యవహారంతోకూడా ఎందుకు సన్నగిల్లింది? ఏదో తప్పుచేసినట్టు ఎందుకు సిగ్గేసింది? మరో అయిదు నిమిషాలైనా ఉండలేకపోయేడు అక్కడ. తిరిగి ఇంటికి మెల్లిగా బయల్దేరేడు.

బయల్దేరబోయేడు.

ఇంతలో ఎదురుగా గోపాలం తమ్ముణ్ని ఎత్తుకొని గోపాలం తల్లి వచ్చింది.

గోపాలం తమ్ముడు అందరికీ తమ్ముడే.

బొంబాయి బస్సుని చూడగానే, తమ్ముడు—నిజంగా చాలా కాలానికి—నవ్వేడు.

"ఏమిటిరా సుబ్బడూ, ఏమిట్రా ఆ చేతిలోదీ?" అని అడిగింది 'తమ్ముడి' తల్లి.

ఎడంగా నిల్చొన్న నల్లగోపాలం నిశ్శబ్దంగా నిల్చొని తీక్ష్ణంగా చూస్తున్నాడు.

"బస్సు! బొంబాయి బస్సు!" అన్నాడు సుబ్బడు, తలవంచుకొని చేతిలో బొమ్మ వైపు చూస్తూ.

బావ రావడం, బొమ్మ తేవడం మొదలైన విషయాలన్నీ నెమ్మదిగా ఒకటీ ఒకటీ తెలుసుకొంది గోపాలం తల్లి.

తమ్ముడు ఈలోపున "బచ్చు బచ్చు" అంటూ చెయ్యి జాస్తూనే ఉన్నాడు.

చూస్తున్నాడు గోపాలం. గోపాలం చూస్తున్నాడు.

తనకయితే ఇవ్వలేదు. తమ్ముడికైనా ఇస్తాడా ఇవ్వడా?

తమ్ముడికేకాని ఇవ్వకపోతే సుబ్బడితో ఆ క్షణంలోనే జట్టు విప్పేసి తీరుతాడు గోపాలం.

సుబ్బడు కూడా చూస్తున్నాడు. వేగిరం ఉడాయించేద్దామని చూస్తున్నాడు. కాని కాలు కదలడంలేదు. అప్పుడు అతనుదూరానికివినబడేలా గుండెలు కొట్టుకుంటున్నాయి.

"తమ్ముడు "బచ్చు బచ్చు" అని అంటూనే ఉన్నాడు.

ఎత్తుకున్న పిల్లణ్ణి నేలని కూర్చోపెడుతూ "ఏదీ ఆ బొమ్మ వాడికోసారి ఇద్దూ" అంది గోపాలం వాళ్ళ అమ్మ.

అప్పటిమట్టుకు బొమ్మని ఇవ్వక తప్పింది కాదు అవిడక్కూడా ఏదో సాకుచెప్పే సాహసం లేకపోయింది సుబ్బడికి

కాని సుబ్బాడుమాత్రం 'గోపాలం వాళ్ళ' ఇంటికి వెళ్ళడం మానేశాడు తరువాత రోజు ఆ తరవాత రోజుకూడా అంతే చేసేడు. స్కూలుకి గోపాలంకంటె ముందుగా వెళ్తున్నాడు. క్లాసులో గోపాలానికి ఎడంగా కూర్చుంటున్నాడు స్కూల్ నుంచి తిరిగి రావడంలో గోపాలాన్ని తప్పించుకొందికి వీలులేకపోతోంది. గోపాలంతో నడుస్తున్నప్పుడుమాత్రం నిశ్శబ్దంగా నడుస్తున్నాడు రెండోరోజుసాయంకాలం కొంతదూరం ఇంటివైపు నడిచేక, జేబులోంచి బటానీలు తీసి "తీసుకోరా" అన్నాడు గోపాలం.

ఎలా ఊహించగలిగేడో కాని సుబ్బడు ఆ బటానీలు పుచ్చుకోడని మాత్రం ఊహించగలిగేడు గోపాలం

"నాకొద్దురా" అన్నాడు సుబ్బడు.

సుబ్బడు ఎందుకొదన్నాడో గోపాలానికి తెలుసు

బటానీలు పుచ్చుకొంటే బస్సు ఎక్కడ ఇచ్చెయ్యవలసి వస్తుందోనని సుబ్బడి భయం.

"ఎవడికావాలి నీడి బస్సు!" అనుకొన్నాడు గోపాలం

అయితే –

సుబ్బడి బస్సు అంటే అక్కర్లేదుకాని, అటువంటి బస్సు కావాలనే ఉంది గోపాలానికి కావాలని ఉన్నప్పటికీ తనకోసం అయితే ఇంట్లో అంతగా [illegible]

కాని తమ్ముడికావాలి ఆబస్సు

[illegible] అందుచేతనే అటువంటి [illegible] కోసం ఇంట్లో [illegible] చేసేడు [illegible], నాన్న తిట్టేడు అమ్మ [illegible]. అమ్మ [illegible] నాన్న [illegible]

ఆ సంగతి సుబ్బడికి ఎక్కడ తెలిసి పోతుందోనన్న భయం కలగడంచేత గోపాలం [illegible] అప్పచెప్పేడు గోపాలం.

కాని, తమ్ముడికి కావాలి ఆ బొమ్మ. మాటిమాటికి "బస్సుబస్సు" అంటూనే ఉన్నాడు

తమ్ముడికేదో జబ్బు ఉందని గోపాలానికి తెలుసు అందరికీ [illegible]. తమ్ముడు మాత్రం నడవడు కాని మొన్న ఆ బొమ్మ చూసినప్పుడు నవ్వేడే! అయితే తమ్ముడి జబ్బు పోతుంది కాబోలు పోతుంది బొమ్మ ఇస్తే పోతుంది సుబ్బడు ఇవ్వడు. ఇంట్లో నాన్న కొనడు.

గోపాలంతర్కం, గోపాలంబాధాకూడా ఎవ్వరికీ తెలీదు

తమ్ముడుమాత్రం తెలివి ఉన్నప్పుడల్లా "బచ్చుబచ్చు" అంటూనే ఉన్నాడు.

చివరకి వాళ్ళమ్మకి విసుగెత్తి ఆరోజు సాయంకాలం, "ఒరే గోపాలం, ఆ సుబ్బణ్ణడిగి ఆ 'బచ్చుట బచ్చు' దాన్నోసారి పట్టారా" అంది

అభిమానాన్నీ పౌరుషాన్నీ చంపుకొని, తమ్ముడికోసం ఆ సుబ్బడిదగ్గరకి వెళ్దామనుకొనే నిశ్చయానికి అంతకుముందే వచ్చేడు గోపాలం ఎందుకోగాని నిశ్చయాన్ని కార్యరూపంలో పెట్టలేకపోతున్నాడు.

అమ్మ ఆజ్ఞ ఆఖరికి గోపాలాన్ని ముంగుకు తోసింది.

గోపాలం రావడం సుబ్బడు చూసుకోలేదు. చూసే ఉన్నట్లయితే బొమ్మని ప్రత్యేకం ఇంట్లో ఎక్కడో దాచక పోయినా, చేతిలో మాత్రం ఉంచుకోకపోను. దురదృష్టవశాత్తూ సుబ్బడి చేతిలో బొమ్మ ఉండగా వచ్చేసేడు గోపాలం,

వస్తూనే అడగవలసిందేదో అడిగేసేడు.

"తమ్ముడు ఏడుస్తున్నాడూ ఒక్కసారి బొంబాయి బస్సుని మా అమ్మ ఇమ్మందిరా" అన్నాడు. తనమాట సుబ్బడు నమ్మడేమోనని,

"కావలిస్తే మా అమ్మనొచ్చి అడుగు" అని కలిపేడు.

గోపాలం అకస్మాత్తుగా వచ్చి అలా చెప్పడంవల్ల ఏ మాలోచించడానికీ సుబ్బడికి అవకాశం లేకపోయింది. అందు చేత ఇంటిదగ్గర్నుంచి బొమ్మపట్టుకొని, వేపచెటువరకూ కిమ్మనకుండా వచ్చేడు. అక్కడికి వచ్చేలోపున ఏదో ఒక నిశ్చయానికి వచ్చినట్టుగా టక్కున ఆగేడు

ఆగి "రేపు తెస్తానని చెప్పరా" అన్నాడు

*   *   *

అంగుకే ఆఖరిసారి అడిగినట్టుగా మళ్ళీ అడిగేడు గోపాలం,

"అయితే ఇవ్వవు కదరా" అని.

వేపచెట్టు బరువుగా ఊగింది. గాలికి ఎండుటాకులు గలగల్లాడుతూ దొర్లేయి దర్జీ దుకాణంలో కుట్టుమెషీను గరగరలాడింది దుకాణంలో కూర్చొని కొాజాలు కుట్టే పదిహేళ్ల కుర్రవాడు ఏది ఉండో, ఏది లేకో, ఎవరికోసమో, ఎందుకో పడే బాధనంతా కంఠంలోకి తెచ్చుకొని పాటల్లో పోసోటుకొంటున్నాడు. చప్టామీద పడుకున్న ముసలాయన మధ్యమధ్య గటిగా దగ్గుతున్నాడు

జవాబు చెప్పకుండా నిల్చున్నాడు సుబ్బడు.

గోపాలం కోపంతో బాధతో వణికి పోతున్నాడని సుబ్బడికి తెలియడంలేదు.

సుబ్బడు గుక్కిళ్ళు మింగుతున్నాడు. బొమ్మని ఇవ్వాలనీ ఉంది. ఇవ్వడానికి ఇష్టంలేకుండానూ ఉంది

"తమ్ముడు ఏడుస్తున్నాడు...అమ్మ అడగమంది...లేపోతే ఎవడిక్కావాలి... నీ వెధవబస్సు" అని మాటలు విరుస్తూ అన్నాడు గోపాలం.

ఎర్రసుబ్బాడు ఎర్రబడ్డం చీకట్లో స్పష్టంగా తెలియడంలేదు ముఖం అమ్మవారి గుడివైపు తిప్పుకున్నాడు. గుళ్లో నూనె దీపం అతని కళ్ళల్లో రెండుగా చీలింది.

"రేపు నే తెస్తారా.. మా బావా, మరొచ్చి మా అక్క రేపెళ్ళిపోతార్రా...అప్పుడు నే పట్టుకొస్తాకదూ" అన్నాడు సుబ్బడు.

బొమ్మను ఇవ్వడానికీ, బావా అక్కవెళ్ళిపోడానికీ గల సంబంధం గోపాలానికి అర్థం కాలేదు. కోపంతో పళ్లు బిగించి ఊపిరి త్వరత్వరగా తీస్తూ విడుస్తూ, ముత్యం మూడోసారిగా మళ్ళీ అడిగేడు.

నూనెదీపం కదుల్తోంది సుబ్బడి గుండెలు త్వరితంగా కొట్టుకొంటున్నాయి. సుబ్బడు తటపటాయిస్తూ నిల్చున్నాడు. సెకెన్లు నడిచిపోతున్నాయనీ, నల్లగోపాలం అగ్గిసెగలా దహించుకు పోతున్నాడనీ తెలుసుకోకుండా ఉన్నాడు.

చివరకి తటాల్న నూనెదీపంనుంచి దృష్టి ఇటువైపు మరల్చి "ఇందరా" అన్నాడు.

దుకాణంలో పడుచువాడు పాట ముగించేడు కుట్టుమెషీను గరగరలాడ్డం మొదలు పెటింది. ముసలాయన దగ్గిదగ్గి "హమ్మయ్యా" అని ఆయాసం తీర్చుకున్నాడు గాలికి ఎండుటాకులు గలగల్లాడుతూ చెదిరి చెదిరి పోయేయి.

"ఇందరా" అని సుబ్బడు అన్నాడేకాని పుచ్చుకోడానికి గోపాలం అక్కడలేడు. ఏనాడో వెళిపోయేడు.

మర్నాడు—

ఉదయం ఆలస్యంగా లేచేడు సుబ్బడు. అందుచేతనో మరెందుచేతనో గోపాలం వాళ్ళ ఇంటికి ఉదయం వెళ్లలేదు తిన్నగా స్కూలుకే వెళిపోయేడు. వెళ్ళేసరికి బాగా ఆలస్యం అయింది క్లాసులో అటూ ఇటూ పచారు చేస్తూన్న 'మాస్టారు' సుబ్బణ్ణి చూసి ఆగి,

"ఏరా, సుబ్బారావూ, ఏడ్రా నీనేస్తం?" అని అడిగేడు

సుబ్బడికి తెలీదు.

"కలిసి రావడం మానేసేరేంరా?"

సుబ్బాడు చెప్పలేడు

# ★ ఇద్దరు పిల్లలు ★

"దెబ్బలాడుకున్నార్రా?"

"లేదండీ"

అనేశాడేకాని సుబ్బడి మనసు పీకుతోంది

ఆరోజు గోపాలం బడికి రానేలేదు

సాయంకాలం అయిగున్నర గంటలకి చేతో బొంబాయిబస్సు పట్టుకొని వేపచెట్టు దాటేడు సుబ్బడు. ఏదో నేరం చేసినవాడి ముఖంలా ముఖం అంతా వాడింది. బరువుగా పడుతోంది అడుగు

గోపాలం ఇంటిముందు, పెంటకుప్ప పక్క నిల్చొని, ముగ్గురు పిల్లలు వీధిలోంచీ ఇంట్లోకి తొంగితొంగి చూస్తున్నారు ఇద్దరివి, ఎర్రగళ్ళలాల్చీలు; ఖాకీ నిక్కరు ఒకడికి నిక్కరే ఉంది కాని చొక్కా లేదు ముగ్గురి చేతుల్లోనూ తాళ్లూ బొంగరాలూ ఉన్నాయి. వాళ్ళకి ఆ ఇంట్లోకి వెళ్ళాలని ఉన్నట్టుగా ఉంది కాని ఎందుకో భయపడుతూన్నట్టుగా ఉన్నారు వాళ్ల మాపులూ, వాళ్ల గుసగుసలూ, మొత్తం మీద వాళ్ళ ప్రవర్తనా చూస్తే సుబ్బడికి ఎందుకోగాని భయం కలిగింది. గుండెలు బరువెక్కాయి జోరుగానడుద్దామనుకొంటే అడుగుమాత్రం తేలిగ్గా పడ్డంలేదు చేతిలో ఉన్న బొంబాయిబస్సు నెత్తిమీదకొండలా ఉంది.

"ఏంరా, గోపాలం లేడూ?" అని కొంచెం బెక్కుతూ అడిగేడు వెళ్తూనే

ముగ్గురు పిల్లలూ కళ్లు పెద్దవి చేసేరు

వాళ్ళల్లో చొక్కాలేనివాడు - దొంగ బాచిగాడు - "ఇష్! నీకు తెల్దుట్రా?" అని సాశ్చర్యంగా అన్నాడు ప్రమాదకరమైనది, ఘోరమైనది, విషాదకరమైనది, ముఖ్యమైనది, ఆ సమయానికి ఎంతో గొప్పదైన వార్త చెప్పబోయే ఆత్రత కనిపిస్తోంది బాచిగాడి ముఖంలో.

ముగ్గురు పిల్లలూ స్వరాలు బాగాతగ్గించి, మాటల్ని జోరుగాదొర్లించి సంగతి ఏమిటో వివరంగా చెప్పేరు చెప్పేక,

"అరె! నువ్వెళ్ళకరా బాబూ! ఎవ్వరూ ఎళ్లకూడదట మావోళ్లు చెప్పేరు" అని ఒక ఎర్రగళ్లచొక్కావాడు గొంతుక తగ్గించి గోలపెట్టేడు

ఆమాటలు సుబ్బడికి వినిపించనేలేదు తొందరగా గుమ్మంలోంచి రెండు మెట్లుదిగి ముందు గదిలోకి వెళ్లేడు

గదిలో ఓవారకి గోడకి ఓ పాత సైకిలు చేరవేసి ఉంది దానికి ఇవతలగా, ఒక తడిసి ఎండిన చాపమీద తలకింద చెయ్యి పెట్టుకొని ఒకపక్కకి తిరిగి పడుకొంది గోపాలంతల్లి తడిసి ఆరని జుట్టంతా ఆమె వంటిమీదా చాపమీదా పడుతోంది శుష్కించిపోయిన ఓ ముసలావిడా, మోటాగాఉన్న ఒక నడివయసు ఆడమనిషీ ఆమె తలదగ్గర కూర్చొని నెమ్మదిగా ఏదో మాట్లాడుతున్నారు

గుమ్మంలోంచే గదంతా కలయజూసి తిన్నగా వెనకగదిలోకి వెళ్లేడు సుబ్బడు.

వెనక గదికి కిటికీల్లేవు గదినిండా నీడలు పడగలువిప్పుకొనిఉన్నాయి చీకట్లో అడవిలాగ సామానంతా అస్పష్టంగా కనిపిస్తోంది. ఎడమవైపుకి ఎత్తుగా భూతంలా నిల్చొంది ఒక పందిరి మంచం.

నీడల్లో మునిగిపోయేడు సుబ్బడు.

కొద్దిసేపట్లో, ముందుగదిలో కూర్చొన్న ముసలావిడ "అయ్యో, పిల్లడు ఏడుస్తున్నాడమ్మా" అంది

ఎక్కడో ఏదో లోకంలో పాతుకుపోయినట్టుగా ఉన్న గోపాలంతల్లి మెల్లిగా కదిలి లేవబోతోంటే, "నువ్వుండమ్మా! నే వెళ్ళి సముదాయిస్తా" అని శుష్కించిపోయిన ఆ ముసలావిడే లేచి గుమ్మందాటి వెనకగదిలోకి వెళ్ళింది

పందిరి మంచానికి పక్కగా, నేలమీద కూర్చొని, ఓ మేకుతో గచ్చుని బద్దలేస్తున్నాడు గోపాలం. వంచిన తల పాముల బుట్టలా ఉంది అడుగు పెదవి కోరలకింద నొక్కుకుపోతోంది

ఎదురుగా నిల్చున్నాడు ఎర్రసుబ్బడు.

కొన్ని వస్తువులు మనుష్యుల్ని వేరు చేస్తాయి

కొన్ని పరిస్థితులు మనుష్యుల్ని దగ్గరగా తీసుకొస్తాయి

ఒకప్పుడు నలుపు నిగనిగ మెరుస్తోంది ఒకప్పుడు ఎండ చల్లగా ఉంటుంది. "నిన్ను అంటం అంటం" అనేటి నక్షత్రాలే ఒకప్పుడు కరిగి జారి కిందకి దిగి భూమిని అంగుకొంటాయి.

ఎర్రసుబ్బడు చెప్పేమాటలు గదిలోకి వచ్చిన ముసలావిడకి సరిగా అర్థంకాలేదు కాని, గోపాలానికి స్పష్టంగా వినిపిస్తున్నాయి, తెలుస్తున్నాయి

గోపాలాన్ని బొంబాయి బస్సు తీసుకోమంటున్నాడు ఎర్రసుబ్బడు

"అచ్చంగా, అచ్చంగా తీసుకోరా! నాకొద్దురా ఇదీ" అంటూ చెయ్యిజాచి ఇస్తున్నాడు బొంబాయి బస్సుని

గోపాలం కన్నెత్తలేదు తలఎత్తలేదు
సుబ్బడికి అక్కరేదట ఆ బస్సు
గోపాలానికూడా అక్కర్లేదు
కావాలన్నది తమ్ముడు
కావాలన్న తమ్ముడు, ఏడీ? ఏడీ? ఏడీ?

బొంబాయి బస్సూ అక్కర్లేదు, సుబ్బడి సానుభూతీ అక్కర్లేదు గోపాలానికి.

సుబ్బడికి అర్థం అవుతోంది గోపాలానికి ఎందుకంతకోపంగా ఉందో అందుకే,—

"మనవాడు కాదే అల్లవాళ్ళ ఎర్ర సుబ్బడు ఏడుస్తున్నాడు"

అనవలసి వచ్చింది ముందుగదిలో చాప దగ్గర తిరిగి కూర్చొన్న ముసలావిడ. ★

# వాయుభక్షకుడు

దాదాపు పదేళ్లక్రితం ఒక పల్లెగ్రామంలో ఒక మామూలు ఇల్లాలు ఒక్కసారిగా ప్రసిద్ధవ్యక్తి అయిపోయింది. ఫలాని మా లక్ష్మమ్మగారింట్లో చాకిరిచేసే రంగడు అన్నమే తినడట. అన్న పుకారు ఊరంతా చుట్టుకుంది. అది క్రమంగా చుట్టుప్రక్కల గ్రామాలకుకూడా పాకింది.

ఈ పుకారు అందరూ నమ్మలేదు.

"ఆ, దొంగవేషమై ఉంటుంది" అన్నారు కొందరు. ఈ విధప్రపంచంలో ఏది చెప్పినా నమ్మేవాళ్లున్నారుగద అన్నారు మరికొందరు. అట్లా అన్నం తినకుండా బతికే అవకాశమే ఉంటే నిన్న మొన్న ఆ బెంగాల్లో అన్ని లక్షలమంది ఎందుకు చావాల్సొచ్చింది? అన్నారు ఇంకొందరు.

కాని ఈవార్త నమ్మినవాళ్లేజాస్తి.

"ఈ సృష్టిలో ఏమహత్తుంటుందో ఎవరు చూశారు? మా వదినగారి ఊర్లో ఓ పిచ్చిపిల్లవాడు చెట్టుచూసి క్షణంలో చెప్పేస్తాట్ట చెట్టున ఎన్ని ఆకులున్నాయో! ఎండుమిరపకాయ గలగల్లాడిస్తే ఎన్ని విత్తులున్నదీ చెప్పేస్తాట!" అని కొందరూ, "జలభక్షణో, వాయుభక్షణో అనే మాటలు ఊరికే పుట్టినయ్యా? ఏపుట్టలో ఏపాముందో ఎవరు చెప్పగలరు? ఏజన్మలోనో యోగిఅయి ఉంటాడు. కించిత్తు దోషం చేసుకొని ఈ జన్మలో ఈ తక్కువపుట్టక పుట్టాడు. ఆ పాపం కాస్తా పరిహారం అయిపోగానే ఆ శ్రీమన్నారాయణమూర్తిగారి సన్నిధికి సరాసరి చక్కాపోతాడు!" అని మరికొందరూ, "ప్రకృతి చిత్రాలను మనం ఊహించలేం. మా మేనమామల ఊళ్లో ఏడు తలల తాటిచెట్టు లేదూ? పిడుగులో ఘంటల అమ్మ కొళ్ళుంచేది కాదూ? హిమాలయం మంచుకొండల్లో దిగంబరులున్నారని మనం వినలా? ఒకానొక నా చిన్నతనంలో మన ఊరి చెరువులో వేసినట్టు వేసుకుని ఈ చివరనుంచి ఆ చివరకు ఈదాడని చెప్పలా? వాటిని మనం అర్థం చేసుకోలేం. మన శక్తిజ్ఞానం చాలదు. అంతే", అని ఒకరూ, తాత్త్వికంగా తలూపుతూ అన్నారు.

ఇంతకూ రంగడు అన్నం తినడనేది ఎట్లా బయటపడిందంటే —

వాడు, మా లక్ష్మమ్మగారింట్లో చాకిరీ చేస్తూండేవాడు. వాడికి వయస్సు పదేళ్లో పన్నెండేళ్లో ఉంటాయి. వాడి అసలు ఆ ఊరు కాదు. తన దేవూరో వాడికి తెలీదు. చిన్నతనంలోనే తల్లి చచ్చింది. తండ్రి ఉన్నాడో లేడో కూడా ఎవరికీ తెలీదు. ఏడాది క్రితం ఆ ఊరు వచ్చాడు. మా లక్ష్మమ్మగారింటికి వచ్చి పని చేస్తానన్నాడు. ఏ చాకిరీ అయినా చేస్తానన్నాడు. జీతంకూడా అడగలేదు. రెండు పూటలా ఇంత తిండిపెట్టే ఏర్పాటుతో వాణ్ణి పనికి పెట్టుకున్నారు. పిల్లల ఎంగిలి కంచాల్లో మిగిలినది వాణ్ణి తినమనేవాళ్లు. కంచాల్లో ఎక్కువ మిగిలినా తక్కువ మిగిలినా వాడేమీ పేచీ పెట్టేవాడు కాదు. ఎంగిలికంచాలు తీసుకుని ఇంటివెనక్కు పోయేవాడు, కంచాలు కడిగి తెచ్చి ఇంట్లో పెట్టేవాడు. కంచాల్లోవి వాడు తింటున్నాడనే మా లక్ష్మమ్మగారనుకునేది. ఆవిడకి మటుకేం తెలుసూ?

**కొడవటిగంటి కుటుంబరావు**

ఒకరోజు వెన్నెలరాత్రి, పిల్లల అన్నాలయాక, ఎందుకో మా లక్ష్మమ్మగారు ఇంటివెనక్కు వెళ్లేసరికి అక్కడ రంగడు తెల్లకుక్కను చేరదీసి దానికి కంచాల్లో అన్నం పెడుతున్నాడు. ఆ పూట రంగడి అన్నం తక్కువయిందని అంతో ఇంతో నొచ్చుకుంటున్న మా లక్ష్మమ్మకి ఇది చూడగానే శివం ఎత్తినట్టయింది.

"నీ కడుపులా కా! ఆ అన్నం కాస్తా కుక్కకి పెడుతున్నావేరా? నువ్వేం తిని చస్తా?" అని అడిగిందావిడ.

రంగడు మాటా పలుకూ లేకుండా కంచాలు తీసుకుపోయి, కడిగి తెచ్చి, లోపల పెట్టి, అరుగుమీద ముడుచుక్కుని పడుకుని, నిద్రపోయాడు. అంతసేపూ యజమానురాలు వాణ్ణి తిట్టిపోస్తానే వుంది. అడుక్కుతినే వాళ్లందరికీ ఉండే తెగులే ఇదన్నది. పిల్లల ఎంగిలి తినటం వాడికి నామోషీ అయింది కాబోలన్నది. పాపం కదా అని ముష్టి వాణ్ణి చేరదీసి పిల్లలతో సమంగా పెంచితే కళ్ళు నెత్తికెక్కాయన్నది. తేరతిండి బాగా వంటపట్టి ఈ కొడుక్కి [illegible]చ్చిందన్నది. నాలుగు రోజులు తిండి పెట్టకపోతే జొక్కమాడి అన్నం విలువ తెలిసి వస్తుందన్నది. ఇంకేమేమో అన్నది. దానికి రంగడు సమాధానం చెప్పలేదు.

కోపంవస్తే మా లక్ష్మమ్మ మామూలు మనిషికాదు. మర్నాడు పొద్దున పిల్లల కంచాల్లో మిగిలినది రంగడు తినటానికి లేకుండా వీధిలో పారేసింది. మళ్ళీ తెల్లకుక్క వచ్చి అది కాస్తా తినేసింది. ఆ కుక్కను చూడగానే తాను చేసినపని అర్థంలేనిపని అని ఆవిడకు తట్టింది. తాను ఆపూట చేసిన పనేగా రాత్రి వాడు చేసిందేమి? అది తిక్క ఎట్లా అవుతుంది?

నిక్షేపంలాంటి అన్నం కాస్తా కుక్కకి పెట్టాడని ఆవిడ ఆగ్రహించిందేగాని, రంగడు ఏంతిన్నాడు, తినకుండా ఎట్లా ఉన్నాడన్న అనుమానం మా లక్ష్మమ్మకు ఇప్పుడే కలిగింది. తాను పెట్టే ఎంగిలి మెతుకులు కుక్కకు వేసివాడు ఇంకేదో తింటూ ఉండాలని ఆవిడకు తోచింది. తిండిగాని, డబ్బులుగాని ఇంట్లోనుంచి దొంగిలిస్తున్నాడా అని ఆలోచించి చూసింది. నమ్మశక్యంగా లేదు. ఒకవేళ అవతల వీధిలో ఉన్న తన ఆడబడుచు వాణ్ణిపిలిచి తిండిపెట్టి డబ్బిచ్చి తనఇంటి రహస్యాలేమన్నా తెలుసుకుంటున్నదా అని అనుమానం కలిగింది. ఈ అనుమానానికి ఆధారం దొరకలేదు. ఎందుకైనా మంచిదని ఆ రోజల్లా వాణ్ణి ఓకంట కనిపెడుతూనే వుంది. వాడెక్కడికీ పోలేదు. ఎవరితోనూ మాట్లాడలేదు.

# ★ వాయు భక్షకుడు ★

ఏమీ కొనుక్కొని తినలేదు అన్నిటినీ మించిన చిత్రమేమంటే తిండిమాటే ఎత్తలేదు మామూలుగానే పనులన్నీ చేశాడు.

ఆరాత్రి మాలక్ష్మమ్మ గుండె కరిగింది. వాడిమీద వచ్చిన కోపమంతా దిగిపోయింది. ఆవిడ లెక్కన వాడప్పటికి మూడు పూటలు తిండి తినలేదు. పిల్లల అన్నాలయినాక వాడికి మామూలుకన్న ఎక్కువ అన్నంపెట్టి, "పో వెధవా. పిచ్చికళలు పోక కడుపునిండా తిను" అన్నది. కంచాలూ, అన్నమూ తీసుకుని రంగడు ఇంటివెనక్కు పోయినాడు మరుక్షణమే ఆవిడ కేదో సందేహం తోచింది. ఆకలిమీద ఉన్నవాడు ఎంత ఆత్రంగా తింటాడో చూదామని ఆవిడ వాడి వెనకే పిల్లిలాగా బయలుదేరింది. ఆవిడ గోడ మలుపునుంచి తొంగిచూసేసరికి బాదంచెట్టు పక్కగా తోక ఆడిస్తూ, తెల్లకుక్క, దానిముందు అన్నం బోర్లిస్తూ రంగడూ కనిపించాడు.

మొదట మాలక్ష్మమ్మ నిర్ఘాంతపోయింది తరవాత ఆవిడకు కలిగినది ఆగ్రహం. ఈ సారి ఆవిడ కోపానికి కారణం అన్నం కుక్కకి వేస్తున్నదని కాదు, రంగడు ఇంత అస్వాభావికంగా ఎందుకు ప్రవర్తిస్తున్నాడని! అసహజమైన పని చెయ్యటంలో వాడికా పట్టుదల ఏమిటని! ఆవిడకు రంగడిపై కలిగిన కోపంలాటిదే పూర్వం హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడిపై కలిగిఉండాలి

"ఒరే రంగడూ! అని ఒక్క పొలికేక పెట్టింది మాలక్ష్మమ్మ రంగడు నిర్ఘాంతపోయినాడు. ఆవిడ దగ్గిరికి వస్తుంటే వొణికిపోయినాడు. మాలక్ష్మమ్మ రంగణ్ణి చేతికి దొరికిన ఎండు బాదంకొమ్మతో బాదింది ఆ బాదుడుకు అర్థంలేదు వాడు తన డొక్క మాడ్చుకుంటున్నాడుగాని ఆవిడకు చేసిన ద్రోహం ఏమీలేదు ఆ ఎంగిలి కంచాల అన్నంతో ఆవిడకు ఇంకేమీ ఉపయోగం లేదు న్యాయంగా అది రంగడిసొత్తు ఆవిడ ఆమోదించే న్యాయం ప్రకారం చూసినా! దాన్ని వాడు ఏంచేసుకున్నా ఆవిడకు అభ్యంతరం ఉండరాదు

రంగడు ఏడిచాడు మళ్ళీ, "ఇట్లా చేస్తావా? చేస్తావా?" అని అడుగుతూ ఆవిడ కొడుతుంటే "చెయ్యనమ్మగారూ చెయ్యనమ్మగారూ!" అన్నాడేగాని వాడు చేసిన తప్పేమిటో వాడికి తెలీదు.

ఇదంతా మాలక్ష్మమ్మకూ సుఖంగా లేదు కొంతసేపయాక ఆవిడ వాణ్ణి లోపలికి తీసుకుపోయి, "ఎందుకిట్లా అన్నం తీసుకుపోయి కుక్కకు పెడతావు? పొద్దునల్లా మాడిస్తినే, సిగ్గులేదుట్రా? నీ పొట్ట సంగతి నువు చూసుకోక ఆ కుక్కగొడవ నీకెందుకురా?" అన్నది

వాడు మాట్లాడలేదు వేరే ఏం తింటున్నావు చెప్పమన్నది ఏమీ తినటం లేదన్నాడు - వాడు. నీ కన్నం అక్కర్లేకపోతే చెప్పు నా చేత నిష్కారణంగా దేనికి వండి వార్పిస్తావు? అన్నదావిడ తనకు అన్నం అక్కర్లేదన్నాడు రంగడు ఆవిడ నిర్ఘాంతపోయింది కాని, వాడు చాలా ఏసుగా తిండితినటమే లేదనివిని, దాన్ని రూఢిచేసుకుని ఆవిడపొందిన ఆశ్చర్యానికి అంతే లేదు

ఆవిడే ఊరంతా టాంటాం వేసింది. రంగడు అసలు అన్నమే తినడని. తననోట ఈమాటవిని ఒక్కొక్కరే ఆశ్చర్యపోతున్నకొద్దీ ఆవిడకు ఓవిధమైన ఆనందం కలగసాగింది. తానే అన్నం తినని మనిషి అయినట్టూ ప్రపంచం తనను చూసే ఆశ్చర్యపోతున్నట్టూ ఆవిడ భావించసాగింది రంగడు అన్నం తినకపోవటంవల్ల తనకు ఊళ్ళో ఇంత ప్రాముఖ్యం వస్తుందని ఆవిడ కలలో కూడా అనుకోలేదు అందరూ రంగణ్ణి గురించి తనను అడిగేవాళ్ళే రంగడికి తానొక గార్డియన్‌అయి కూచుంది!

కాని యీ ఆనందం ఆవిడకాశే కాలం దక్కలేదు ఇతరులు రంగణ్ణి తనకు కాకుండాచేయాలని చూస్తున్నట్టు ఆవిడకు తోచింది పొరుగింటి సుబ్బమ్మవచ్చి చాలా ఇద్ప కొలాడింది. రంగణ్ణి చూసినప్పుడే అనుకుందిట, వాడు మామూలుమనిషి కాడని- నోరుబడ! వాడు తనఇంట్లో నేపనిచేస్తుంటే పువ్వుల్లో పెట్టి పూజించేదట! వాణ్ణి కుక్కకన్నా హీనంగా చూశానట వాడు వచ్చినప్పట్నుంచీ మాలక్ష్మమ్మగారి ఇంటికి ఎంతో కలిసొచ్చిందట! వాడొచ్చిన ఏడు మాలక్ష్మమ్మగారి కాకరపాదు కాచిన కాపుతోనే తాను - అంటే సుబ్బమ్మ - అదంతా రంగడి మహిమ అనుకుందిట

ఆంజనేయోపాసన చేసే ఆ గడ్డం హనుమయ్య వచ్చాడు. రంగడికేసి రెప్పవాల్చకుండా చాలాసేపు చూసి, తల ఆడించి, "తెలిసింది, తెలిసింది" అన్నాడు చేతులు జోడించి ఆకాశంకేసి చూసి, కళ్ళు తేలేసి, గుంజిలుతీసి, రంగడి దగ్గిరికివచ్చి వాడి చెవులో ఏదో చాలాసేపు నూరిపోశాడు. "హనుమయ్య ఏం చెప్పాడ్రా?" అని తరవాత అడిగితే రంగడు భయంతో "చెప్పకూడదు, చెబితే నాతల పగిలిపోతుంది" అన్నాడు.

నోరు మాట్లాడితే నొసలు వెక్కిరిస్తుంది. ఆ బసవయ్యకు ఆయనవచ్చి కళ్ళెగరేస్తూ "నేర్పంటే మాలక్ష్మమ్మది రంగడికిన్నాళ్ళూ జీతమూ ఇవ్వకుండా, తిండీ పెట్టకుండా పనిచేయించుకుంది?" అని పదిమంది వింటుండగా అనేశాడు—నోరుబడ

రంగడుకూడా వెనకటి రంగడు కాడిప్పుడు అందరూ తనను చూడరావటమూ "ఎన్నాళ్ళనుంచీ నువు తిండిమానేశావురా? నీ కెవరైనా మంత్రం వచ్చా! ఏ బైరాగి అయినా చిట్కా ఇచ్చాడా? చాటుగా ఏమన్నా తింటూంటావా? కావాలని అన్నం తింటే ఏమవుతుందిరా? కడుపు నెప్పి వస్తుందా? దాహమవుతుందా? వంటవాసన

వస్తే నోరూరదూ?" ఇత్యాది ప్రశ్నలు వేస్తూండడము వాడికి భలే సరదాగా ఉంది.

గడచిన రోజుల్లో టెంటుసినిమా లాడించిన వెంకయ్య రంగణ్ణి గురించి మొదటగా పత్రికల్లో వేయించాడు. ఆయనే పత్రిక పట్టుకువచ్చి తాను వేయించిన వార్త చదివి వినిపించాడు..."ఈ కుర్రవానికి వ్రాయను చదువను రాదు వీనికి ఎట్టి మంత్రములును రావు. ఈ వింత చూచుటకు ప్రజలు తండోప తండములుగా చుట్టు ప్రక్కల గ్రామములనుండి వచ్చుచున్నారు కొందరు ఈ భగవదంశ సంభూతునికి కానుకలు అర్పించి మ్రొక్కుకొనుచున్నారు," అని వెంకయ్య చదివే సరికి, అదంతా నిజం కాకపోయినా ఊళ్లో వాళ్లు హర్షించారు.

ఈ వార్త పత్రికల్లో పడ్డనాటినుండీ నిజంగానే జనం కానుకలతో రాసాగారు మాలక్ష్మమ్మ కంగారులో పడింది. ఈ వచ్చేజనమూ, వాళ్లు తెచ్చే కానుకలూ మొదలైనవి చూస్తే వాటికి తగ్గ పవిత్ర వాతావరణం తనయింట లేనట్టు ఆవిడకు స్పష్టయింది. ఈ సంగతి ఆవిడ వెంకయ్యతోనే అన్నది. వెంటనే వెంకయ్యకు గొప్ప ఆలోచన తట్టింది ఆయన రాఘవయ్యతో మాట్లాడి, వాళ్ళతోటలో చిన్న కుటీరం వేయించాడు. అందులో రంగడికి మకాం ఏర్పాటు చేశారు వాడికి చిన్న యోగి వేషం వేయించాడు వెంకయ్య. తపస్సు చేస్తున్నట్టు వాణ్ణి కూచోమన్నారు. ఎవరికీ ఏమీ జవాబు లివ్వక్కర్లేదన్నారు. భక్తుల్నందర్నీ అక్కడికి రమ్మనమన్నారు.

రంగడి కిది సమ్మతంకాలేదు. ఒకగంట కదలకుండా కూచునేసరికి వాడికి యమచెర అయిపోయింది. ఆకలి ఒకటి లేకపోయినా వాడికి మిగిలిన కోరికలన్నీ ఉన్నాయారు మరి గొడ్లమధ్య తిరగటం, గోలీ కాయ లాడటం, చింతచెట్లెక్కడం, బుడ్డకాలవలో ఈతలుకొట్టటం, డాం దగ్గిర చేపలు పట్టేవాళ్ళతో కబుర్లు చెప్పటం: ఇవే వీ లేందే వాడికి జీవితమే లేదు. కళ్లుమూసుకుని కూచుంటే వాడికి మొదట్లో నవ్వొచ్చింది.

"ఛీ నవ్వకు" అన్నాడు రాఘవయ్య.

"మేం చెప్పినట్టు చేయకపోతివా తాట వొలుస్తాం!" అన్నాడు వెంకయ్య. ఈ ఇద్దరూ వాడికి యముల వాళ్లయినారు.

కుక్క ఒకసమస్య అయింది రంగడు రాఘవయ్యగారి తోటలో మకాం పెట్టినట్టు తెల్లకుక్క పసికట్టి నేరుగా వాడిదగ్గిరికివచ్చి వాడి కెదురుగా కూచొంది. రంగడు రెండు మణికట్లూ రెండు మోకాళ్ల మీదా ఆనించి అభయముద్ర పట్టినట్లు కళ్లు మూసుకుని కూచుంటే కుక్కకి ఇదంతా నిజమా? లేక నేను కలగంటున్నానా? అని అనుమానం కలిగినట్టుంది. అది తల ఒక పక్కకి ఒరగేసి రంగడికేసి పరీక్షగా చూసి, ఎందుకన్నా మంచిదని ముందుకువచ్చి వాడి మొహం నాకింది ఈ సమయంలో లోపలికి వచ్చిన రాఘవయ్య దానినడుం విరిగేట్టు ఒక్కతన్ను తన్నాడు. ఏ అపరాధం చెయ్యని తెల్లకుక్క భగవంతుడికి మొర పెట్టుకుంటూ అవతలికి పోయి పాక బయటి నుంచి అరవసాగింది.

మాలక్ష్మమ్మను ఎవరూ తన్న లేదుగాని ఆవిడ గతీ దాదాపు కుక్కగతే అయింది. ఆవిడ పని మానుకుని ఒక పూటల్లా రంగడి దగ్గిరే కూచుంది. ఎందుకు కూచున్నదీ ఆవిడకే తెలీదు. వాడిమీద తనకిప్పుడే హక్కూ లేదని ఆవిడ కింకా స్పష్టంగా తెలియ లేదు రంగడి భక్తులెవరూ తనను గురించి పట్టించుకోవటం లేదు మధ్యాహ్నం పదకొండింటికి ఆవిడకు ఎవరో తోపడ్డట్టయింది. తాను ఇక్కడ కూచుంటే ఇంటిపను లెవరు చేస్తారు? అయినా తన కిక్కడ ఏం పని? తాను రంగడికి కానుకలివ్వటం గాని, మొక్కుకోవటం గాని అసంభవం. అసలు రంగడు అట్లా కూచోవటమే ఆవిడకు ఎబ్బెట్టుగా ఉంది ఎవరికీ చెప్పకుండా మాలక్ష్మమ్మగారు ఇంటికి వెళ్ళిపోయింది.

రంగడికి ఫొటో తీయించి పత్రికల్లో వేయించాలని వెంకయ్య సంకల్పించాడు. వెంకయ్య దగ్గిర పాత కామెరా ఒకటుంది. దాంతో ఫొటోలు తీశాడు. కాని లాభం లేకపోయింది. ఒక ఫొటోలో రంగడి తల కాయ లేదు. రెండోదాన్లో వాడు ఒరగబడి కూచున్నట్టు పడ్డాడు. అన్నిటిలోనూ పొగ మంచు రంగణ్ణి ఆవరించినట్టుగానే వుంది. ఒక్కదానిలోనూ వాడి మొహమూ ముక్కూ తెలియరావటం లేదు.

గత్యంతరంలేక వెంకయ్య బస్తీకివెళ్ళి ఒక ఫొటోగ్రాఫర్ని తీసుకొచ్చాడు. వాడు మూడు ఫొటోలు ఎత్తాడు. ఒక దాంట్లో రంగడు ఒకడే ఉన్నాడు. రెండో దాన్లో రంగడూ, పక్కన రాఘవయ్యా ఉన్నారు. ఇది చాలా అన్యాయం. "రంగడివెంట నువ్వుంటే నేనూ ఉండాలి. అని వెంకయ్య అభ్యంతరపెట్టిన మీదట మూడో ఫొటో ముగ్గురితోనూ తీశాడు ఫొటోగ్రాఫర్. రాఘవయ్యే ఫొటోగ్రాఫర్ కు డబ్బిచ్చి పంపాడు.

నాలుగోనాటికి ఫొటోలు వచ్చాయి. అన్నీ ఒకఫొటో కాపీలే అందులో రంగడూ రాఘవయ్య మాత్రమే ఉన్నారు. వెంకయ్య ఆదరాబాదరా బస్తీకిపోయి ఫొటోగ్రాఫర్ని ఇదేమిటని అడిగాడు "నన్నేం చెయ్యమన్నా? మిగిలిన రెండు ప్లేట్లూ పగిలిపోయాయి." అన్నాడు ఫొటోగ్రాఫర్.

రంగడు చాలా గిట్టుబాటుగా ఉన్నాడు. వాడూ, రాఘవయ్యా ఉన్న ఫొటో పత్రికల్లో పడ్డప్పటినుంచీ జనం దూరపు గ్రామాలనుంచి కూడా రాసాగారు. కట్నాలూ, కానుకలూ, రాసాగాయి. ఇందులో వెంకయ్యకు వంతుపెట్టటం రాఘవయ్యకు కష్టదండగగా తోచింది.

"నువుకూడా పనిమానుకొని ఈతోటలో దేనికి? పనిబడ్డప్పుడు నేను నీకు కబురు చేస్తాగా?" అన్నాడు రాఘవయ్య వెంకయ్యతో.

"ఓహో! అదా సంగతి?" అన్నాడు వెంకయ్య.

మర్నాటినుంచీ వెంకయ్య రకరకాల ప్రచారం చెయ్యసాగాడు రంగడు మూడు పూటలా మెక్కి తింటాడనీ, రాఘవయ్య ప్రపంచాన్ని వంచిస్తున్నాడనీ ఊరూరా ప్రచారం చెయ్యసాగాడు ఈ ప్రచారం ఊరికే పోలేదు. రంగడికి కానుకలు అర్పించుకున్నవాళ్లు కొందరు రంగడిలో ఏ మహత్తూ లేదనీ, వాడికి దణ్ణంపెట్టి కోరుకుంటే కోరిక సిద్ధించదనీ అనసాగారు.

ఒకరోజు వెంకయ్యగారి దడి అంటుకుంది రంగణ్ణిగురించి దుష్ప్రచారం చేసినందుకే ఈ పని జరిగి ఉంటుందని రాఘవయ్య కొందరితో అన్నాడు. అందరూ నమ్మలేదు. రంగణ్ణిగురించి ఎందరో ఎన్నిరకాలుగానో చెప్పుకున్నారు. కాని వాడి అవస్థ విచారించినవాడు లేడు. వాడిగతి నానాటికీ దుర్భరమవుతున్నది. రాత్రిపూటే వాడి ప్రాణానికి కాస్త సుఖం ఒకరాత్రి వాడు కుటీరందాటి తోటదాటి పొలాలన్నీ చుట్టి వచ్చాడు. ఇంటికి రాగానే రాఘవయ్య చావదన్నాడు.

"ఈసారి తోట దాటిపోయి చూడు, పూడ్చి వడతా!" అన్నాడు రాఘవయ్య. మర్నాడు లేదు, ఆ మర్నాటి రాత్రి రాఘవయ్య గురకపెట్టి నిద్రపోతున్న సమయంలో రంగడు తోట దాటాడు. రాఘవయ్య తంతాడని కాబోలు మళ్ళీ వాడు తిరిగి రాలేదు. వాడు మళ్ళీ ఆ వూరికి తిరిగి రాలేదు. వాడిజాడ తెలుసుకున్నవారు కూడా లేరు.

[ఆలిండియా రేడియో ప్రసారితం] ★

# కొత్త పైక్కొత్త

పవ్యాసి: తలుపులమ్మా, ఓ తలుపులమ్మా ఆ వొచ్చివోడు సిన్నం నాయుడు నాగు న్నాడు??? ఎప్పుడొచ్చినా వేటి మెడ్రాసు నుంచి?

తలుపులమ్మ: అవును మావియ్యా, ఇయ్యాలకి మూడురోజులైంది.

స: ఏట్రోరి సిన్నంనాయుడు, ఎప్పు డొచ్చినా వేటి. పట్నంనుంచి? అదేట్రా అలాగ మారిపోనావ్రా.

సిన్నం: ఏ బాగు నేనా?

త: ఏటి మొగోడివి కాదట్రా? అవులు వచ్చినారని మీసంమీద కత్తిరేయించి నావు? పురుగ్గొట్టేసినట్టు నేదూ. మావియ్యా, ఈడి మీసం?

స: అః అః పిలక్కూడా తీసేసినావేటి?

సి: నేని తీయించేనానట్రా? గెడ్డావు మూసిందని ఎవల్నో అడిగినాను. ఒక సాపు చూపించి అందుల్లోకి ఎల్లమనేసినాడు.

స: అవుల్నీ?

సి: అవుల్నీ? వనూ, అందులోంచెవడో వొచ్చినా జెబ్బట్టుకోని, కురిసీ మీద కూకోబెట్టేస్నాడు. ఆహా, ఏటి సెప్పన్రా? ఎటుసూసినా అద్దాలే, పెద పెద్దయి. వొయి కుంటం అనుకో...

స: అబ్బా!

సి: మీద దుప్పటి కప్పేసి, నాకు ముసు కేసి, ఏటో బాసపడిగేడు. అదేటో తెలక, కానిమన్నాను. ఎనకాల దురదెత్తే గోక్కు న్నాను. దాంతో లటుక్కుమని పిలక తీసేసి నాడు.

త: మరిగ్గతే నువ్వూరుకున్నావట్రా?

సి: ఎట్రోరి గడ్డం గీయమంటే పిలక కత్తిరించెసినావంటే, సకం తల కత్తిరించేసి ఆ బాసని మల్లా ఏటో అన్నాడు. ఈ లోపుని సుట్టుపక్కలోలంతా గొల్లుమని నవ్వటం మొదలెట్టినారు. అందులో మన తెలుగోడేనట ఆడేటో సెప్పినాడు. ఈడి మాటసలే తెల్దుమనకి. అది తెలుగూ కాదు, అలమాటా కాదు. ఈ గొడవేదో తెలక బుర్ర వూపేసినాను. రెండునిమసాల్లో గడ్డం గీసేసి, సవరం సేసేసి, సెయ్యి సాపినాడు డబ్బులికి. సరే మాబాగా సేసినావు అని అను కోని ఎంతేటన్నాను. అరుపా అన్నాడు.

స: ఏటి సవరానికి ఆరు రూపాయలా, ఇచ్చినావేటిరా?

సి: మరేటనుకున్నావేటి? యిత్తానా? కాత్తే, యీ ఏసాలు నాదగిరెయ్యకు, ఆరు రూపాయలేటి సవరానికి, అని రూపాయి సేతులో ఎట్టి కళ్ళెర్ర జేసినాను. మల్లీ మాటాడకుండా పుచ్చీసుకున్నాడు.

త: అవున్రా, సిన్నంనాయ్డు, సవరం అంటే గేపకం వొచ్చింది. నాను సవరం తెమ్మన్నాను. తెచ్చినావా?

స: ఏం సవరం పూరుకోయే, అణ్ణి సెప్ప నియ్యే.

సి: సవరాలు సూసినానుకాని, అన్నీ మునిలెంటుకులియ్యేనే.

త: పోనీయిగాని సిన్నంనాయ్డు, రెండు రోజులేసానికి మీసం తీసేసినాడట నీలాట్రోడే.

సి: మీకలాగేవుంతాదిలే. ఇదిసెయ్యడం ఎంత మంచిదనుకున్నావేటి. ఇక్కడోల్ని మురగాల్ని సూసినట్టు సూసినవ్వుతా రక్కడోలు.

స: పోనియిగానోరే, అక్కడిసేసనాలు ఏటి సెప్పదూ.

---

సి: ఏటిసెప్పను? సూసి తీరాలి. సెపితే టుంది. కన్నులు వొయికుంటం కాదట మావా మెడ్రాసంటేని.

స: అవును గానోరే నువ్వు ఆవులింట్లో దిగినావక్కడ?

సి: ఆవులింట్లో దిగనిత్తారు? రెయ్యిలు బండిలో అవులో సెప్పినారు. రాంబాయి గారి సత్తిరం ఉంది, అందులో దిగమని.

త: మన వరాలరాజుగారి సత్రంనాగ అక్కడా వున్నాయేటి సత్రాలు?

స: మద్దిని నువ్వొకటే! పట్నంగాని పట్నం, సత్రాలేవుండవేటే, నువు సెప్పరా, సిన్నంనాయుడు.

సి: ఏటి సెప్పమంటావు? కన్నులు వొయికుంటమే. మన కేసి రెయ్యిలు బండి ఎక్కడాగుతాది?

స: టేసనికాడ.

సి: మెడ్రాసులో రెయ్యిలు బండి యింట్లోకే ఎలిపోతాది.

త: ఏట్రాయిది. ఇచ్చిత్రం.

సి: అవునే. పెద్దిల్లుంతాది. అందులో కెల్లాగింది. ఎవులోల్లాగొచ్చి పడ్డారు.

స: అవున్రా అలు?

సి: కూలోల్లు. సేతుల్లో సామాను పీక్కెల్లి పోటమే.

త: అయిబాబు. నువ్వూరుకున్నావట్రా?

సి: నా నోదిలినానేటి. నా సేతులో మూటకి నా పక్కబండ్లోనుంచి అవులో దొర్సాని దిగినాది. దాన్నట్టుకోని దొర సెలగాటాలాడతన్నాడు. పైడితల్లి తీర్థం నాగ జనం కిటకిట లాడుతుంటే, ఇదేట్రా అని సూత్తుంటే సల్లగా నా మూటొకడు ఎత్తికెల్లిపోతున్నాడూ! పరిగెత్తికెల్లి ఆడ్ని పట్టుకున్నాను. టపీమని, ఆడు, ముందు సెంపకాయ కొట్టేసినాడు.

త: నువ్వాడ్ని కొట్టడంపోయి, ఆడిసే తిన్నావా? మరి నువ్వూరుకున్నావా?

సి: ఊరుకుంతానా! దుమ్మలిరగ్గొట్టేసి నాను. కోతనుకుంతారేమో ఆడు గుటుక్కుమని పేనం వొగ్గేసినాడు. సచ్చినోణ్ణి తీసి కెల్లిపోనారు. అక్కడున్నావోలు ముక్కుమీదేలెట్టేసికోని, బాబూ మీదేవూరని అడిగినారు. మాదిజ్ఞానగరంకాడ కొణిసి, నా పేరు నల్లి సిన్నంనాయుడు అన్నాను.

స: బాబోరే పేరు నిలబెట్టినావురా.

సి: కాపోతేటిమావా. అనుకూంత మునిలోడు కనక సంపేసినాను. పడుసోడైతే ఏంసేసెద్దునో.

త: మా మంచిపని సేసినావురా. సెప్పు.

సి: ఆ జనంలోంచి బయటపడ్డానో లేదో జటకాబండ్లోలు మీదపడ్డారు. ఒకడు మూటట్టుకోని అటులాగ ఇంకోడు ఇటు లాగాను. పేనం సాలొచ్చిందనుకో. బేరి మని కేకెట్టినాను. దాంతోటి వగ్గిసి నారు. ఇంకోడెవడో కూంత మనమాట తెలిసినోడు, బాబు ఎక్కడికెల్లాలన్నాడు.

త: పోనియిలే.

సి: బండోడితోటి రాంబాయిగారి సత్తిరం కెల్లాలన్నాను. మంచోడి నాగున్నాడు, ఎంటనే ఎక్కించేసుకున్నాడు.

స: మన ఇజ్ఞానగరంనాగ బండిలో యింకవుల్ని ఎక్కించుకోనేదా?

సి: నేదు. పొద్దునెక్కిన బండి, ఎల్లీ, ఎల్లీ, మద్దేనానికి దేబెట్టేసినాడు. కూలెంతంటే పదిరూపాయలన్నాడు. ఇంతదూరం వుంది, అంతయినా వుండదా అని, సాలే ఎనిమిది రూపాయలుచ్చుకో అని యిచ్చేసి నాను. ఇంతడబ్బు పుచ్చుకోని కాఫీ కేటయినా సిల్లరి డబ్బులేటయినా యియ్యవా అంతాడు.

త అయినకాడికి ఎనిమిది రూపాయ లుచ్చుకోని మళ్లీ కాపీకి డబ్బులా.

సి: నేనిచ్చినా నేటి నేన్నే నా కడుపు మండుతుందని కేకేసి పల్లు బిగబెట్టె, కళ్లెర్ర సేసేతప్పుడికి, కోతలను కుంతారేమో, మాయమయిపోనాడు.

స: మరి నీ తిండో?

సి అక్కడెవల్నో అడిగితే, రండి బాబూ అని వొట్టేల్లోకి తీసుకెలినాడు. నోపటికెళ్లీతప్పుడికి వరసగా బల్లలున్నాయి అందులో ఒకదానిమీద కూకో మన్నారు. నన్ను తీసుకెల్లినోడు నా పక్కనే కూకున్నాడు తిండానికి. ఒకడి త్తరాకులు మా ముందొడేసి పోనాడు ఇంకోడు వన్నం, నెయ్యి, కూర్లు, అప్పడాలు, గబాగబా, పడేసుకెల్లిపోనాడు. నాలుగు మెతుకులు కలిపినానో నేదో దప్పళం వొట్టుకొచ్చినాడు

త: యెంత తింటే అంతేటేత్తారేటి?

సి: ఓ - ఆ మద్దినెప్పుడో కొల్లకూడే నంట ఇప్పుడు తిన్నంతా యెట్టెత్తన్నారు.

త: నయివే.

సి: మనకేటి కావాలో అడక్కుండా వొడేసికెల్లిపోతాడు. ఆలకెలా తెలుత్తాదో యేమో, బగమంతుడు నాగ. కడుపునిండా తినిసినావు, ఆడూ నేనున్ను.

త ఆడెవడు?

స: మన సిన్నంనాయుడ్ని వొట్టేల్లోకి తీసికెల్లినాడుకోడా ఆడు

సి: ఆడుముందు తినేసి, సెయ్యి కడుక్కొని, తములపాకు లొటుకొత్తానని ఎల్లినాడు మరి రానేదు నేను సెగిసిసూత్తుంటే, ఇద్దరికి కలిపి నన్నియ్యమన్నాడు వొట్టేలోడు నేన్నే, ఆడెవడో నాకేటి తెల్సు అన్నాను డబ్బులిచ్చి మరీ కదులని యిద్దరు నా సెరొకజబ్బ వొట్టుకున్నారు కోతలను కుంతారేటోకాని వొక వూపు వూపేనో నేనో చైడు కాలవాలోకి పడ్డా రిద్దరూను పళ్లు బిగించి ముందుకెల్తుంటే ఒకడు నాగెడ్డ మొట్టుకోని బాబేటనుకోకు, మాదే తప్పని, అప్పుడునుంచి ముందే డబ్బుచ్చుకోని సీటీలియ్యడం మొదలెట్టినారు

సన్యాసి. పోనియిగా నొరే, వూరు యిసేసనాలు లేటో సెప్పినావుగందా

సి ఏటి సెప్పమంటావు సన్యాసిమావ! వొయికుంటం కాదూ, ఎల్లి సూడాలికాని, నేనొక్క నోటితోటి ఏది సెప్పను?

త మమ్మల్ని రమ్మన్నాడు కూడాను, మావియ్య ఈడూ ఎలిపోయి, యింటికాడ మీ అబ్బాయీ నేకపోతే కోతలెవలు కోత్తారు పొలంకాడ?

సి అది కాదే డబ్బయిపోద్దని, మీగు రానేగు. నాకు తెల్లేటి మీయేసం మాబావ రాకపోతే నువ్వు రానేకపోనావా? మూతి బిగించి మూటకట్టండ్రా సచ్చినప్పొడొట్టికెల్లిపోదురుగాని.

స: పోనాలతో శేటి, నువ్వు సెప్పరా.

సి. శేసిని కెదురుగుండా ఏట్రో పేద్దదుంది.

స: ఏటిదది?

సి: ఆసపటాలు. లోనకెల్లినాను

త: నీవొల్లు బాగు నేదేటి నేపోతే ఆసపటా లెందుకు నీకు?

సి కాదే, సూద్దామని నోపలకెల్తేని ఆపరేసను సేత్తాన్నా రెవలకోను. గుమ్మంకాడ నిలబడ్డాను డాకిటేరొచ్చి సెయ్యొట్టుకోని నోపలికి తీసుకెళ్ళి కుర్చీమీద కూకోబెట్టినాడు ఒక బల్లమీద తలకాయ నొప్పోణ్ని పడుకోబెట్టినారు టకాటకా మని రెండుదెబ్బలు కత్తితో తలకాయమీద కొట్టినారు. టపీమని పెట్టిమూతొచ్చీసినట్లు పుర్రొచ్చీసినాది

స ఆ ఏటి ఇచ్చిత్రం

సి: ఆడితల్లోంచి రెండు కిలకిల్లాడుతున్నాయి తీసి సిప్పలొ జేసినాడు డాకిటేరు.

త. ఏటయ్యి?

సి కప్ప పిల్లలు

త బుర్రలోకెలా గొచ్చినాయి కప్పపిల్లలు.

స అదేనే, ఆడిని సెప్పనియ్యే, మద్దిని నువ్వేటి

సి మల్లా బుర్ర అతికేసి పడుకున్నవోడిని నేపినాడు

త ఆడు సెగిసినాడా

సి మారాజునాగ కన్ను నులుపుకోని సెగిసి ఏటదని అడిగినాడు. డాకిటేరు, నువ్వెప్పుడైనా సంవద్రతానమాడినావా అని అడిగినాడు ఆడినాను బాబన్నాడాడు. మరిగైతే ఇయ్యి సంవద్రం కప్పలు కాలవ కప్పలు కావన్నాడాడు నువ్వు తానవాడినప్పుడు రెండు కప్పగుడ్లు నీ ముక్కులోంచి నోపలికెల్లిపోయి పిల్లలైపోనా యన్నాడు నా దగ్గిరికి రాకపోతే నీ బుర్ర కప్పబుర్రయిపోను అనీసినాడు డాకటేరు.

స ఒరే మన నారాయణగోడిది కప్పబుర్రేరా ఆడ్ని అక్కడికి తీసికెళ్ళి ఆపరేసను సేత్తే సిన్నంనాయుడు బాగున్నేమో నొరే

సి ఆడెక్కడొత్తాడు.

త రాపోతే పోనాడుకాని, యింకేటేటి సూసినావో నువ్వు సెప్పరా

సి అహో, ఏటిసెప్పను మావా. కార్లైన కాల కార్లు, బుర్రు బుర్రు సెల్లిపోతాయి నడిసినప్పుడుగాని సూసుకోపోతే వొచ్చి పడిపోనాదన్నమాటే

స ఏటిదగి?

★ కోతపై కో

సి కార్లు

త అవులియ్యా కార్లు?

ఎ. అవులియి, ఆలబాబు కొడుకులియ్యా. ఊళోలియ్యా.



అవునే, ఆలియ్యా అక్కడ, బస్సులుంతాయి ఆట్లె మీదెక్కేసి యొక్కడికెక్కా వాలంటే అక్కడికి ఎల్లి పోడమే

త: డబ్బుచ్చుకుంతారా?

సి. ఉచ్చుకోరా మరి. ఉచ్చుకుంతేం గాక, ఆటిల్లో కూకుంటే పేనం సొగిసొచ్చినట్టుంతాది. ఆటిల్లోనూ పరుపులే మావా. మన బస్సుల్లో కూకుంటే నడుం జారిపోయి, వొల్లు కవిలిపోయి, జొరం వొచ్చినట్టుంతాది ఆయాలలాగ నడిసెల్లినాను కూంత దూరమెల్లినూత్తే పొద్దున్న రెయ్యలుబండి దిగిన సేసిను కొపడ్డాది

స: పొద్దున్న జటకా యెక్కితే మద్దేనానికి సత్తిరం కాడ దేబెట్టినాడన్నావూ

సి: అదే మావా నాలుగు గజాలదూరం నేదు ఊరంతా బలాదూరు తిప్పుకొచ్చి ఎనిమిదిరూపాయలా దేసుకున్నాడు మల్లి కొపడతాడేమో నని నూసినాను

త కొపడ్డాడా?

సి వొదిలి పెట్టినా నేటి, కోతలను కుంటారో! మక్కలిరగ బొడిసేసానను కోండి

త. మా మాంచి పనిసేసినావు. ఆడు సావ నేదుకదా?

సి సచ్చినంత పనైందిలే

స. ఎంత మాయరా! మిడుసు అంతాను.

సి· మరేటనుకున్నావేటి? ఆయేల్నుంచి సెద్దు సొరుగున్నానులే గోడ కవతల గట్టుని విదో బస్సాగింది సముద్రం వొడ్డుకి యెల్తాదా అంటే యెల్తాదన్నాడు, డైవారు. అందులో కూకున్నాను ఆడెవడో డబ్బులుచ్చుకొని పిక్కెట్టచ్చినాడు కొంతలక్క ఎల్లేక బస్సాగిపోనాది అందరూ దిగి పోనారు బస్సుకి మిస్టింగం వొచ్చిందను కున్నాను దిగమన్నారు దిగి ఏదయ్యా సముంద్రం అన్నాను అల్లదిగో నడిసె ల్నన్నాడు మల్లి బస్సెక్కి, సాల్లే సముంద్రం వొడ్డుకని పిక్కెటు కోసినావు నేనిక్కడ దిగనే హన్ను అప్పుడు సచ్చినట్టు బస్సు సంవద్రపొడ్డుకి పోనిచ్చినాడు

స నువ్వు గడుసోడివి కొబట్ట సరిపోనాది మానాంటోలయితే ఏటిగతీ

సి మీనాటోలయితే ఎనక్కోల తాటాకులుకట్టి, ముందుమంటె బైయ్యారు? సంవద్ర పొడ్డుని అలబాసని బీసీఅంతారు ఏం జనం, మావా, పోలిపిలి సంబ్రంఅనుకో ఆడోల్లు, మొగోల్లు పిల్లల్నంటేసుకోని వొచ్చేత్తారు.

త అక్కడేట సేత్తారు?

సి· ఏట సేత్తారు? వొచ్చినోలు, ఎల్లీ వోలు మొకోలుకేసి సూసుకోని కూకుంతారు ఎవడోవచ్చి నా పక్కని కూకు

నా కు ం సంకేచూరనా కు కూ

దిజ్ఞానగరం కాడ కొణిసి నా పేరు నల్లి సిన్నం నాయుడంటారన్నాను అలాగ వోల్లు మరిసిపోయి కూసున్నీ తలికి పొద్దుపోనాది గబీమని వల్ల్రటీ నైట్లు ముట్టించీసినారు పొట్ట పొగుత్తై పోనాది. పొగులేవుంది, పొద్దోయిం తరువాత సూడాలి. వొయికుంటవె అనుకోనాను నేటయిపోనాదని నెగిసినాను. నువ్వెక్కడి కెల్లాలన్నాడు నా పక్కని కూసున్నావోడు రాంబాయిగారి సత్రంలో మకాం అని చెప్పినాను

స ఆడిదార్ని ఆడు పోనాడు కావోసు

సి· ఆడలాగ నడిసెలినాడో నేదో, వొచ్చి పడ్డాం రామీద అరగజం మంది.

స. అవులు?

సి అవులా, దొంగలు.

త ఆ వూళ్లోను దొంగలుంతారేటి? అమ్మ బాబోయ్, నిన్నేటి సేసియ నేదుగద

స అతని దగ్గిరికి రానిత్తాడేటే, మన సిన్నంనాయుడు?

సి అక్కడొక కర్రముక్క పడుంతేని, అదొట్టుకోని సాము సెయ్యడం మొదలెట్టినాను సూసుకో, కోతలనుకుంతారు కాని' సాము సేత్తుంటే దెబ్బలకి కాళ్లిరిగిపోయి నోళ్లు, పీక తెగి, రోడ్డుమీద దొర్లిపోయి నోళ్ళు, ఏటి సెప్పను ఇంతనోకి జనం మూగిపోనారు బాబూ మన దేవూరని అడిగినారు మాది ఇజ్ఞానగరం కాడ కొణిసి, నా పేరు నల్లి సిన్నంనాయుడనీతప్పడికి, ముక్కుమీ దేలెట్టేసుకున్నారు. అంగులో వొకడు బాబూ మీ రెక్కడకెల్లాలన్నాడు రాంబాయిగారి దత్రవు కాడికంటే ఆడి కారులో నన్నింటికాడికి దెబెట్టేసినాడు

స. ఆ దెవడో మంచోడినాగున్నాడు

సి బాబూ రేపు మాయింటికి యిందుకి రావాలన్నాడు ఆడి మకాం కాయితం మీద రాసిచ్చినాడు ఆడిమ్లు మా దత్రానికి దగ్గిరిలో నేఉంది

త మరాడింటికి గెల్లినావా?

సి ఓ, ఎల్లినాను ఆడు నోపయున్నాడో నేదో, బయటొక్కపిట్టయినా లేగు. తోడ పెద్దలాంటి రెండు కుక్కలు గుమ్మాని కడ్డంగా ఇటొకటి అటొకటి కూకున్నాయి బొమ్మలనుకున్నాను నాను నన్ను సూసి బొయ్యిమని మీదపడ్డాని కొచ్చినయి

త ఒరి బాబో మీదపడి కరిసెయి నేదు కద!

సి నేగు, గీటేసుంది చే ఒగ్గుద్దుతో ఆ రెండు బేపెల్ని సంపెదును గాని, ఆ డేగు తొడని వూరుకున్నాను

స మరేటి సేసినావు?

సి ఇంతటినోకి ఆడు పరుగెటుకొచ్చి సెయ్యొట్టుకోని నోపలి తీసుకెల్లినాడు ఏం బోజనం యెట్టినాడని సెప్పను? కడుపు నిండా నాలుగు మెతుకులు తిని అలాగ నడిసెల్లినాను

త అతగోడు నిన్ను మోటరులో దేబెట్టనేదా?

సి దేబెడతానని బతుకుములాడినాడు వొద్దనీసినాను అలాగ నడి సెల్లినాను కూంతలక్కెల్లీ తప్పడికి జంతువులు కాలేజీ అని బోర్డిఉంది అదేటోసూద్దాం అని నోపల కెలినాను.

పైడన్న: ఏరోయి సిన్నంనాయుడు, ఎప్పుడొచ్చినావేటి?

స కూకోరా పైడెన్నా. మన సిన్నం నాయుడు మెడ్రాసు ఇసేసనాలు సెప్పతున్నాడు ఇన్నా

పై ఊ, సెప్పరా

సి: నోపలికి యెల్లినాను.

పై ఏ నేపలకి?

సి జంతువులు కాలీజీనోకి

పై అదేం జంతువులి కాలేజోయ్, కలకత్తానో సూడాలి

స బాబోరే నువ్వు కలకత్తా సూసినావు కాని, అడ్ని సెప్పనిదు ఊ, సెప్పరా సిన్నంనాయుడు.

సి ఏం జంతువులోస్ సివాలు, పుల్లు, ఏనుగలు, కోతులు, ఒకటేటి అన్నీ సగువు కుంతన్నాయి. అందికే కాలేజంతారు దాన్ని

పై అక్కడయ్యి సదువుకుంతన్నాయి కాని, కలకత్తాలో పాటలే పాడెత్తాయి

సి సూడండ్రా యీగు, సెప్పనీయడం లేదు

స ఒరే పైడన్న నువ్వ మాటాడక యినుకుంతావా, ఎలిపోతావా సెప్పరా, ఆడితోటేటి, సెప్పరా నువ్వ

త నువ్వ నోపలి కెల్తినావు, అయికరిసియి నేద్రటా?

పై అట్టకి కమ్మలు బిగించుతాయి ఈతలికి రా నేవు

సి నేను నోపలి కెల్లిపోనాను పులీ మీద సెయ్యేసి గువ్వినా మేకపిల్లనాగ ఏటనదు

త ఒరిబాబు నీకేటిబయం ఎయ్యనేగు?

పై ఓసి, కలకత్తా సివంనోళ్లో మన తలకాయెట్టినా ఏటనగు

సి తెలేనుగు నేదంటూరా! నేను తెల్లేనుగును సూసినాను

పై ఓ సదేనా, కలకత్తాలో నేను పచ్చేనుగుని సూసీసినాను

స ఇక్కడా వుంటేయట పచ్చేనుగులు. సచ్చిపోనాయి గాని, నిప్పకోడంట అదీ గుజ్జవంత వుంతాది మూతులో ఎఱటి నిప్పలాగుకొచ్చి దానిముంద లెట్టేసినాదు లటుకు, లటుకుమని మింగేసినాది.

పై ఓస్ అది సూసినావు కాని, ఇన్నా. కలకత్తాలోను ఎఱటి పాముందిరా అది కుంపట్లో యెలిగే నిప్పలుమీద తొంగుంతాది దానిపక్కని బుట్టలో బొగ్గలేసుకోని కూకోని, కుంపట్లో రెండుబొగ్గలేసి, ఉప్పా, ఉప్పా అని ఊదుతుంతాడొకడు.

స. ఎందుకురా వూదడం ?

పై నిప్ప లారిపోతే పాము సచ్చిపోతాది

స అవును గానొరే, పైడన్నా, తెల్లేనుగుంతాదని ఇన్నాంగానీ, నువ్వ పచ్చేనుగుని సూసినానంతావు, పచ్చేనుగుంతాదిరా?

పై సిన్నంనాయుడు తెల్లేనుగుని సూసినాడేటి? నేను పచ్చేనుగిని సూడనేదనటానికి? ఆడు కోతకోత్తే ఆడికి పైకోత నేను కోసినాను కోతకి పైకోత అంతే

స: నా నప్పడే అనుకున్నాను. ఏటీ చిత్రం ఈడు సెప్పీయన్ని నిబద్దేనా అని.

సి ఏటీ? నాను సెప్పినియ్యన్నీ కోతలను కుంతన్నారేటి? కావాలంటే మీరెల్లి సూసిరండ్రి,

స నేనెంతె సూడెన్నగుగాని మా పెద్దన్న యుద్దంలో సేరిపోయి మెడ్రాసులో నే వుండేవోడు. నీ కెరిక నేదె తలుపులమ్మ! ఏంగో అక్కడ యియ్యుంటాయి, అయ్యుంటాయని సెప్పీవోడు కాని యిలాటి కోతలు కోసినాడా!

త మాయన్న అబద్దాలాడినాడంతావా?

స కోతలు కాక మరేటే గంటకొకణ్ణి సంపేసినాడటేగు ఆ లూయసన్నారంట.

సి ఏంరా పైడన్నా, నువ్వ మాటాడ వేటిరా కలకత్తాలో నువ్వ, మెడ్రాసులో నేను సూసె పోనీలే అని ఈలకి సెప్తుంటే యిగాగే వుంటాది ఏలాకోలం. పోదాం పదరా మన కేటి?

త అవున్నా, మీరెల్లండి ఈలతో టేటి?

స అవునే అన్న నెంటేసుకొత్తిన్నవు కాని, పైడన్న కలకత్తా యెల్లినాడేటి? ఆలబాబు సెప్పినాడు ఈడుండేది కటకం రిక్సా గాడీ నాగేవోడని

పై కలకత్తా ఎక్కడగుంటనుకున్నారేటి? కటకం యీది గుమ్మంనో నే ఏరా సిన్నం నాయుడు మాటాడవు?

సి· అవున నాగే

పై కావలిత్తే పుర్రపల్లాయిని కను కొండి కిందటేగు పెద్దపండుక్కి ఆడింట్లో వున్నానో నేదో

గురువులు. ఏరోయ్ పుర్రపుల్లాయంతన్నారు

పై కాదురా గురువులు, కూకో, నేను కలకత్తా సూడనేదంతన్నారు కిందటేగు



## కోతపై కోత



పెద్దపండక్కి పుర్రపుల్లాయింటికాడ దిగి
నానని సెప్పుతున్నాను.
ఏ పిదీ, పండక్కి నానా డింటికాడ

పదిరోజు లుండొచ్చినాను? నువ్వెక్క
డొచ్చినావు?
త ఏట్రా ఈలతోటి మీ రెల్లండి

యినుకున్నవోలికి సెప్పీవోలు నోరువని.
మీరెల్లండి యిన్నకాడికియిని, కమ్మకట్టె
త్తన్నారు నేన్నే. (అలిండియారేడియో)




# ఆంధ్రమాతా!!

శ్రీనివాసశాస్త్రి

★

జయము! జయము!
మన ఆంధ్రమాతకు!
జయము! జయము!
మన కన్నతల్లికి !!

*　　*　　*

విజయ వర్షమున
విజయమొందెదను
జయ వర్షము మన
జయము కావలెను !!

*　　*　　*

జయము! జయము!
మన ఆంధ్రమాతకు!
జయము! జయము!
మన కన్నతల్లికి!!

*　　*　　*

వచ్చెను ఉగాది
పండుగ మనకూ!
తెచ్చెను వసంత
శోభల నెన్నో !
హెచ్చెను బాలల
కౌతుకమ్మూ !
వచ్చిపలుకరా
జేజేల్ మాతకు !!

*　　*　　*

జయము! జయము!
మన ఆంధ్రమాతకు !
జయము! జయము !
మన కన్నతల్లికి !!

*　　*　　*

సస్యము లన్నియు
చక్కగ పండీ
దేశము సౌభా
గ్యమ్మును పొందే !
జయ వర్షమ్మున
జయమ్మె నీదే
జయ! జయ! జయ !
జయ! ఆంధ్రమాతా !!

*　　*　　*

జయము! జయము !
మన ఆంధ్రమాతకు !
జయము! జయము!
మన కన్న తల్లికి !!



# కర్పూరద్వీపయాత్ర



(బొమ్మరిల్లు సీరియల్)

నోరి నరసింహశాస్త్రి

## 9

కొత్తరాజుకు విదేశవర్తకుడు కోశాధికారి ఐనప్పటినుంచీ పూర్వమెన్నడూ లేని డబ్బు రాసాగింది. విద్వాంసుడు మంత్రిగా ఉండి రాజు సేనలను బలపరిచి చాలామంది రాజులతో మైత్రి చేయించాడు. పెంకితనం చూపిన రాజులమీదికి సేనలుపంపి శాస్తిచేశాడు. ఈవిధంగా కొత్తరాజు శీఘ్రకాలంలో గొప్ప చక్రవర్తి ఐనాడు.

చక్రవర్తి అంటే ఎవరో తెలుసునా? చాలామంది రాజులకు పైరాజు. అటువంటివాడికి పెద్ద సింహాసనం ఉంటుంది. దానిమీద ఆయన కూచుంటాడు. ఆయనపాదాలు పెట్టుకొనేందుకు పాదపీఠమనే రత్నపీఠమొకటి ఉంటుంది. కింది రాజులంతా వచ్చి తమశిరస్సులు కిరీటాలతోసహా ఆపాదపీఠానికి ఆనించి వంగి మొక్కుతారు. ప్రపంచంలో ఉన్న రాజులంతావచ్చి ఆవిధంగా అతనికి మొక్కేట్లుగా ప్రధాని చేశాడు.

రాజ్యం పెద్దదవుతున్నకొద్దీ కోశాధికారి కోశముకూడా పెద్దది చేస్తున్నాడు. ధనం పోస్తుంటే కొట్లకు కొట్లు పట్టక నిండిపోతున్నవి. రకరకాల రత్నాలు వజ్రాలు ముత్యాలు బంగారము వెండి—అన్నీ పెరిగిపోతున్నవి. అంతా కోశాధికారి దమ్మిడీలతోసహా జాగ్రత్తగా లెక్కవేస్తున్నాడు.

చక్రవర్తికి అంతవైభవము అంత సంపదఉన్నా, ఆయన కంతకంటె విలువైనది సంగీతవిద్వాంసుని సంగీతము. అది అంత ఆనందం కలిగించేది. విద్వాంసులంటే గౌరవమున్న కొద్దిమందికికూడా ఈరోజుల్లో ఒకవిధమైన భయముంటుంది. తక్కిన అశేషజనానికి అసహ్యంకూడా ఉన్నదనడం పొరపాటు కాదు. అటువంటి ఈరోజులలో సంగీతవిద్వాంసుడంటే సరిగ్గా అర్థంకాదేమో!

ఆ విద్వాంసుడి సంగీతమెట్లాంటిదో తెలుసునా? అది చక్రవర్తికీ ఆయన ఆస్థానంలోని విద్వాంసులకూ చెప్పలేనంత ఆనందం కలిగించేది. అంతేకాదు సభలోఉన్న సేనాపతులకూ అన్నిరకాల అమాంబాపతు ఉద్యోగస్థులకూ—అంటే డెబ్భైరెండు నియోగాలవారికీ, అట్లాగే ఆనందంగా ఉండేది. ఇంకా అంతేకాదు. సింహాసనంవెనక చామరాలు విసనకర్రలు విసురుతూ ఉండే యవనపరిచారికలు ఆనందతన్మయత్వంతో నిశ్చేష్టులై తమ చేతుల్లోవీవనలట్లాగే వేలవేసుకొని నిలిచిపోయేవారు. వాళ్లుచేసిన విధిభంగము ఎవరూ గమనించేవాళ్ళేకాదు. మరి అక్కడ రాజుగారి ఊడిగాలు చేయడానికి పొట్టిగా ఉండేకుబ్జలూ వంకరటింకర దేహాలవాళ్లూ తదేకధ్యానంగా ఆలకించేవాళ్లు. జబ్బులవల్లా దురభ్యాసాలవల్లా ముక్కుమూతి ముడిచేవాళ్లూ, కళ్లు మాటిమాటికీ ఆర్పేవాళ్లూ, ఉలిక్కిపడ్డట్లు తరుచుగా వీపు చరుచుకొనేవాళ్లూ, చేతులూ



"కవిపాటకెల్లా మంత్రి భార్యకాళ్లు నరికించి
తెప్పించాలి! కోశాధిపతి భార్యనాలుక కోయించాలి!
గాయకుని భార్యకళ్లు పీకించాలి!" (13 వ ప్రకరణం)

తలలూ కాళ్లూ ఆడించేవాళ్లూ—అన్ని ఊపులూ అర్పులూ వణుకులూ ఆపి శ్రద్ధగా గోడమీది చిత్రాలవలె నిలచిపోయేవాళ్లు మనస్సులో రాక్షసబుద్ధికలిగి చక్రవర్తిమీద కసి తీర్చుకోవలెనని ఎప్పుడూ ఆలోచించే వాళ్లుకూడా ఆసంగీతంవిని తమ పూర్వవైరాలు మరచేవాళ్లు.

అది వినడానికి రాజధానినగరంలోని బాలురను బాలికలనుకూడా పిలిపించేవాళ్లు, అప్పుడప్పుడు. వాళ్లుకూడా ఆసంగీతం వింటున్నంతసేపూ ఒక్కకోతిచేష్టకూడా చేయకుండా బుద్ధిమంతులలాగా కూచుని ఆలకించేవాళ్లు. అట్లా పాడేవాణ్ణి విద్వాంసుడంటే ఈకాలంలో ఎవరన్నా నమ్ముతారా?

సంగీతశాస్త్రమంటే సంగీతంలో ఏమీ లోపం లేకుండా ఆబాలగోపాలము ఆనందించేట్లు పాడగల శక్తి కలిగించే దన్నమాట చక్రవర్తి మహారాజ్యము విచ్చిపోకుండా ఒక్కసూత్రంతో కట్టుబడి ఉన్న

# ★ కర్పూర ద్వీప యాత్ర ★

వంటి, దానికి మంత్రి రాజనీతి చక్రవర్తి పరాక్రమము కోశాధికారి కూర్చిన మహాధనమూ గొప్పకారని నాలే. ఐతే వాటి అన్నిటికంటె ఆమహారాజ్యంలో అశేషప్రజలకు సామరస్యం కలిగించింది ఆ గాయకు దివ్యగానమే. అది పిల్లలఆటవలే మాటవలే ముద్దుగా ఉండేది.

రాజమందిరం ముందు ఉండేగుర్రాలూ ఏనుగులూకూడా కదలకుండా వినేవి. గోష్ఠంలో ఆవులూ దూడలూ మేతకూడా చాలించి సంగీతమాలకించేవి. చివరకు కుక్కలూ పిల్లులూకూడా హాయిగా వినేవి.

మీరెన్నడన్నా గ్రీకు కథలలో ఆర్ఫియను అనే గాయకుడి సంగతి విన్నారా? అతని భార్య చనిపోతే దానిని బతికించుకోవలెనని తన వీణతీసుకొని పాడుకుంటూపోయి యమధర్మరాజును ఎదరగని ప్రేతపతిని కూడా మెప్పించాడంటారు. అజాతి సంగీత మహాగాయకుడిది.

## 10

కాలమంతా సుఖంగా గడచిపోతున్నది. లోకంలో యుద్ధాలులేవు. స్పర్ధలులేవు. అన్యాయాలు లేవు. కరువులు లేవు. కాటకాలు లేవు. జనుల కందరికీ పుష్కలంగా తినడానికి తిండి కట్టడానికి గుడ్డ నివసించడానికి సుఖమైనఇళ్ళూ ఉన్నవి. పనిపాటలు చేయడమంటే అందరికీ ఆటగా ఉన్నది.

రాజుగారు దేశమంతా చక్కని బాటలు వేయించాడు. కాలవలు తవ్వించాడు, ఆనకట్టలు కట్టించాడు. ఆసుపత్రులు ఊరూరా పెట్టించి ఆయుర్వేద మెరిగిన వైద్యులను ప్రజలకూ, సహదేవశాస్త్ర మెరిగిన వారిని పశువులకూ, ఉచితంగా వైద్యముచేయడానికి ఏర్పాట్లు చేయించాడు. రెండుకోసుల కొకటి చొప్పున ధర్మసత్రాలు పెట్టించాడు. ఎక్కడ ఎండకాలమైతే అక్కడ చలివేంద్రలు వేయించాడు. చలి దేశాల్లో వెచ్చగా ఉండేందుకు చలిమంటలు ఏర్పాటు చేశాడు. ఉత్సవాలు క్రీడలు వినోదాలు అందరికీ అందుబాటులోకి తెచ్చాడు. ఆదర్శ నాటకశాలలు కట్టించి ఉత్తమ నాటకాలు ప్రజలందరికీ ఉచితంగా ప్రదర్శింపజేశాడు. చిత్రశాలలు నిర్మించాడు. దేవాలయాలు కట్టించాడు. దేవాలయాలు, ధర్మాదాయాలు సక్రమ మార్గాలలో నిర్వహింపబడేట్లు చూశాడు. ఇక ఆయన పెట్టించిన విద్యాలయాలకు లెక్కలేదు. బాలబాలికలకు వినోద విజ్ఞానకేంద్రాలు స్థాపించాడు.

ఈ లోకంలో అతడు తృప్తిపరచినది ఒక్క మనుష్యులనే కాదు. పశువులు, పక్షులు, కీటకాలు, సమస్త భూతాలు తృప్తిపొందినవి. గోసంపద వృద్ధి అయింది.

అనేక యజ్ఞాలు యాగాలు చేసి భూరిదక్షిణలిచ్చి ఈ లోకవాసులనే కాక ఇతర లోకవాసులను కూడా చక్రవర్తి తృప్తిపరచినాడు.

ఐతే హాయిగా ఎల్లకాలం గడిచిపోతుందా? ఒకనాడు గట్టి చిక్కు చక్రవర్తికి వచ్చింది. అదీ మహారాణి వల్లనే వచ్చింది. వెనక అడవిలో ఆమె పెంకె జవాబులు మీకు జ్ఞాపకమున్నవిగా, ఆ పెంకె తనమే చిక్కంతా తెచ్చిపెట్టింది ఆమె ఎంత మంచిదైతే ఏమి లాభము!

ఒకనాడు మధ్యాహ్నము ఆమెకు పురాణశ్రవణము చేదామని బుద్ధిపుట్టింది. పౌరాణికుని రమ్మని కబురంపి తన సాహసగత్తెలకు కూడా కబురంపింది. వాళ్లురానిది ఆమె కేమీ తోచదు.

పౌరాణికుడు వచ్చేలోపుగానే కోశాధిపతి భార్య వచ్చేసింది. పురాణం మొదలు పెట్టబోతుండగా గాయకుడి భార్యకూడా వచ్చింది. మంత్రి భార్య పురాణం మొదలుపెట్టినా కూడా రాలేదు. ఆ రోజున మంత్రిగారింట్లో దూరదేశాలనుండి వచ్చిన విద్వాంసులెందరో అతిథులుగా ఉన్నారు ఎందరు నౌకర్లున్నా వారి సౌకర్యాలు కనిపెట్టడానికి ఆమె ఇంటివద్ద స్వయంగా ఉండక తప్పిందికాదు. మహారాణి పంపిన నౌకరతో తనకు వచ్చే తీరిక లేదని చెప్పి పంపింది.

పురాణం చెబుతున్నంతసేపూ మహారాణి మనస్సంతా మంత్రి భార్యమీదనే ఉన్నది. మాటి మాటికీ ఆమెకోసము తల ఎత్తి చూస్తున్నది ఎంతసేపటికీ ఆమె రాలేదు సరికదా, తానుపంపిన చేటిక ఐనా తిరిగి ఎందుకు రాలేదు ? 'ఎందుకు రాలేదు ?' — పురాణంలో ఒక్క ముక్కకూడా ఆమె చెవిని పడడంలేదు.

అందులో ఆనాడు పురాణం విన్నవాళ్లంతా ఎంతో బాగున్నదని మెచ్చుకుంటున్నారు. మార్కండేయ పురాణంలో విదేహరాజు నరకానికి వెళ్లిన ఘట్టం పౌరాణికుడు వినిపిస్తున్నాడు ఆ రాజు అడగగా యమదూత అతనికి ఒక్కొక్క నరకమే చూపుతూ అక్కడ బాధపడేవాళ్లు ఏమేమి పాపాలు చేశారో చెపుతున్నాడు.

"అదుగో, దేవతలకు అతిథులకు పితరులకు అగ్నికి భూతాలకు పశులకు పిల్లలకు ఇంటికివచ్చిన అభ్యాగతులకు పరిజనులకు పెట్టకుండా ముందుగా తానే అన్నము తినువాడు, చూచావా,—అతని దేహము పర్వతమంత పెద్దదిగా ఉన్నది, నోరు సూదివలె చిన్నది,—ఎంత తిన్నా కడుపునిండక బాధపడుతున్నాడు. అతడు తినేదికూడా, ఎబ్బె, బంక!

"అదుగో, అక్కడ చూడు! తన పంక్తిలో ఒకడికి ఒకవిధంగానూ ఇంకొకడికి ఇంకొక విధంగానూ ఫలభక్షణ చేయించినవాడు బురద తింటున్నాడు.

"తనతో కలసి యాత్రకు వచ్చిన వాడికి అన్నము పెట్టకుండా తానే తిన్నవాణ్ణి అక్కడ చీమిడి తినిపిస్తున్నారు.

"అదుగో! తల్లినిగాని తండ్రినిగాని అన్ననుగాని తమ్ముణ్ణిగాని అక్కనుగాని చెల్లెలినిగాని పెద్దలను గాని ఆవునుగాని అగ్నినిగాని కోపంతో తన్నినవాణ్ణి ఏంజేస్తున్నారో చూచావా? ఎర్రగా కాలిన సంకెళ్ళతో వాడి పాదాలు రెండు గట్టిగా బిగించి తొడల లోతు నిప్పులలో పడేసి శిక్షిస్తున్నారు.

"తల్లిదండ్రుల నుంచి పిల్లలను భార్యా భర్తలను స్నేహితులను చుట్టాలను గురు శిష్యులను అన్నదమ్ములను—ఒకరికొకరు కాకుండా విరోధంపెట్టి వేరుచేసిన దుర్మార్గులను చిరుకత్తులతో ముక్కలు ముక్కలుగా నరుకుతున్నారు చూడు!

"చాడీలు చెప్పేవాడి నాలికను, అవిగో, ఆ పక్షులు తమ ఇనపముక్కులతో ఎట్లా రెండుగా చీలుస్తున్నవో చూశావా?

"పాయసము పులగము వంటి దేవతాయోగ్యమైన అన్నాలు దేవతలకుగాని తోటివారికిగాని పెట్టకుండా తానే తిన్నవాణ్ణి నేలమీద పడేసి ఒళ్లంతా యమభటులు మునిపళ్ళతో చీకుతున్నారు.

"అటు చూడు! రచ్చకూటాన్ని దేవాలయాన్నీ చలివేంద్రను పడగొట్టిన వాళ్ళను చర్మాలు ఒలిచివేస్తున్నారు. ఒలిచిన చర్మము మళ్ళీ వస్తే మళ్ళీ ఒలుస్తున్నారు.

"అదుగో, బాగా చూడు! లంచాలు పుచ్చుకున్న ఉద్యోగస్తులను, తప్పుడు సాక్ష్యాలు చెప్పిన వాళ్ళను, దారుణమైన ఆ యంత్రంలో పెట్టి, నలిపి పారేస్తున్నారు. నీ రాజ్యంలో పనిచేసిన అధికారులు ఎవరైనా అందులో గుర్తు వస్తున్నారా ?

"విసనకర్ర చందనము వట్టివేళ్లు హరించిన వాళ్లను మాడుతున్న ఇసుకమీద వేసి వేగిస్తున్నారు చూడు !

"ఇక తన పిల్లలకు పెట్టకుండా తన ఒక్క కడుపే కాచుకున్న తండ్రిని పళ్ళురాలగొట్టి అతని ఒంటికండలు తరిగి అతని నోట్లోనే పెట్టి బలవంతాన తినిపిస్తున్నారు.

"మరి, మంచివాళ్ళ మనస్సుకు నొప్పి కలిగేట్లు దూరులాడిన మనిషి ఒంటిని పక్షులు తొక్కిపట్టి పొడిచి తూట్లు చేస్తున్నవి చూడు!

"అబ్బా, ఉపకారికి అపకారం చేసిన కృతఘ్నుణ్ణి ఎట్లా శిక్షిస్తున్నారో చూస్తున్నావా? కాస్త

# ★ కర్పూర ద్వీప యాత్ర ★

సేపు వేడికుంభంలోను మరికొంతసేపు వేడి ఇనకలోను వేస్తున్నారు. అక్కడినుంచి మళ్ళీతీసి యంత్రంమీద వేసి చక్రంమీద తిప్పి నలగగొట్టుతున్నారు. చక్రంమీది నుంచి లాగి కింద పడవేసి తాళ్లతో ఒళ్లంతా నరుకుళ్లు పడేట్లు బిగించి కడుతున్నారు. వాడికీ యాతనలోనుంచి విముక్తి ఎన్నటికో కూడా తోచడంలేదు.

"పిల్లలకూ పిల్లలవంటి అమాయకమైన మనస్సులు గలవాళ్ళకు మంచి కథలు చెప్పిన వాళ్లనూ చక్కని బొమ్మలు వ్రాసిన వాళ్లనూ చూచి ఓర్వలేక తేనెమాటలతో నిందించిన దుర్విమర్శకులను చూడు- తేళ్లతో కుట్టిస్తున్నారు, జెర్రులతో పాకించి కుట్టిస్తున్నారు, పాములచేత కరిపిస్తున్నారు. విషానికి విరుగుడు విషమేగా!—"

ఈ మొదలైన విధంగా యమదూత విదేహరాజుకు వాళ్ల బాధలు వర్ణించుకొంటూ ముందు రౌరవ నరకం చూపెంచాడు. అందులో మంటలలో నానాబాధలు పడుతున్నారు.

తర్వాత తమో నరకం చూపించాడు. అందులో ఒళ్లు బిగిసే చీకటిలో పడి ఆకలి దాహంతో తపన పడుతూ నిలవలేక తమ ఒంటి మాంసము తింటూ తమ నెత్తురే తాగుతున్నారు

పిమ్మట నికృంతన నరకం చూపించాడు. అందులో అనేకమైన కుమ్మరి సారెలు తిరుగుతున్నవి. వాటిమీద పాపాత్ములను పడేసి పాశాలతో ఒళ్లంతా తెంపుతున్నారు.

అనంతరం అప్రతిష్ఠనరకం చూపించాడు. అందులో వాళ్లను రాట్నాలకు కట్టి తిప్పుతూఉంటే నెత్తురు కళ్లల్లోనుంచి చిమ్ముతున్నది, పేగులు నోళ్లల్లోనుంచి వెళ్లుకుని వస్తున్నవి

ఆపైన అసిపత్రనరకం చూపించాడు అందులో బయటమంటలూ, లోపల కత్తులే ఆకులుగాగల చెట్లూ, కుక్కలూ ఉన్నవి. మంటలవేడికి తాళలేక వనంలోకిపోతే చెట్లమీదినుంచి ఆకుకత్తులు రాలి ఒళ్లు చీలుస్తున్నవి; కుక్కలు పైకి కవిసి పీకుతున్నవి.

ఆమీద తప్తకుంభనరకం చూపించాడు. అందులో మసలకాగిన నూనెలున్న పెద్దబానలలో తలక్రిందులుగా పాపిష్ఠివాళ్లను పడేస్తున్నారు.

చివరకు రాజు కాతడు అమితకర్దమనరకం చూపించాడు. నీళ్లు తాగబోయే ఆవులను పిల్లలను తాగ కుండా అడ్డం కొట్టినవాళ్లను అక్కడ పడేశారు. వాళ్లక్కడ ఎప్పుడూ ఒకటే దాహంతోనూ ఆకలితోనూ బాధపడుతున్నారు.

## 11

ఇట్లా యమదూత ఆ విదేహరాజుకు నరకాలు ఒక్కొక్కటే చూపుకుంటూ పోతున్నాడు. ఆ రాజు పాలుగారే బుగ్గలతో మూడేళ్లపిల్లవాడివలె ముద్దువస్తున్నాడు. అప్పుడు నరకంలో మహాద్భుత మొకటి జరిగిందట.

అక్కడ తపనపడేవాళ్ల ఒంటిమీద, ఎన్నడూలేనిది, హాయిగా చల్లటిగాలి వీచింది. దుర్వా సన తగ్గి సువాసన ప్రసరించింది. గాయాలతో బాధపడేవాళ్ల శరీరాలకు నవనీతం రాచినట్లు చమ్మగా ఉన్నది. కటికచీకట్లో ఉన్నవాళ్లకు ఒక్క సూర్యకిరణం ప్రసరించినట్లయింది. ఆకలవుతున్న వాళ్ల ఆకలీ, దాహ మవుతున్న వాళ్లదాహమూ రవ్వంత శాంతించినట్లయింది

నరకంలో ఇదేమిటి, ఇదేమిటి?—అంతా ఆశ్చర్యపడి చూస్తున్నారు.

అంతలో రాజు యమదూత నొకటి అడిగినాడు. "ఏమయ్యా, నాకు తెలిసినంతవరకు నేను పుణ్యమేకాని పాపమేమీ చేసి ఎరగనే. నన్నెందు కిక్కడికి తెచ్చావో?"

యమదూత అన్నాడుగదా, "రాజ్యాంతే నరకం ధ్రువమ్! ఆ లాంఛనం తీర్చడానికి నిన్నిక్కడికి తెచ్చాను. అదీకాక ధర్మవిషయంలో ఒకనాడు నీభార్య అడిగినమాట నీవు వినిపించుకోలేదు.—అయినా ఆ లాంఛనంకూడా తీరిపోయిందిలే. ఇక స్వర్గానికి పద. అదుగో, విమానంకూడా వచ్చింది."

ఆ మాటలు విని విదేహరాజు విమానమెక్కబోతున్నాడు. అప్పుడు ఒక్కసారిగా నరకవాసులంతా నానాగోడవా చేశారు.

"ఓ పుణ్యమూర్తీ, కాస్త ఆగవయ్యా! నీ వంటిమీదినుంచి సుగంధము ఇక్కడంతా వ్యాపించి యాతనపడే మా దేహాల కింత చల్లగా తాకుతున్నదయ్యా!—ఒక్క ముహూర్తమైనా ఆగరాదా, తండ్రీ!—కాస్త ఆగవా?—మామీద దయలేదా?—"

ఆ ఆర్తనాదాలు విని యమదూతను, వీరి కందరికీ ఇంతసుఖం కలిగించడానికి నేనేమి పుణ్యం చేశానేమిటి ?" అని రాజడిగాడు.

"నీవా ? పితరులను దేవలను అతిథులను ఆశ్రితులను ముందు తృప్తిగా భుజింపజేసి శిష్టాన్నముతో నిత్యమూ నీవు తుష్టి పొందుతూ, అనేకయాగాలు ప్రసిద్ధంగా చేసిన పుణ్యమూర్తివి, రాజా! అందుచేత నీ పుణ్యదేహమునుండి వచ్చేసువాసన ఈ నారకులకు సుఖం కలిగిస్తున్నది."

యమదూత మాటలు విని రాజిట్లా ఖండితంగా చెప్పేశాడు: "అట్లాగే అయితే నేనిక్కడనుంచి ఇంకొకచోటికి రాను. ఈ బాధలుపడేవాళ్లకు ఉపశాంతి కలిగించడంకంటే స్వర్గసుఖమూ బ్రహ్మపదమూ కూడా నాకెక్కువ రుచికావు.

ఇట్లా అంటూ రాజు అక్కడినుంచి కదలి రానంటూ రానని మొండికేశాడు. చివరకు యమధర్మరాజూ దేవేంద్రుడూ స్వయంగా వచ్చి స్వర్గానికి కదలి రమ్మని ఎన్నోవిధాల చెప్పచూచారు.

"పాపాత్ములు నరకంలో బాధపడక తప్పతుందా ? నాయనా, పుణ్యాత్ముడవైన నీవు స్వర్గంలో సుఖపడవలెనయ్యా !"

"ప్రభువుల్లారా, మీకు నమస్కారాలు ! నే చేసిన పుణ్యమెంతో సెలవిస్తారా ?"

ఇంద్రు డన్నాడు. "నాయనా, నీవుచేసిన పుణ్యము లెక్కచెబుతా విను. ఆకాశంలో చుక్కలెన్ని ఉన్నవి ? లోకంలో ఇసుక రేణువు లెన్ని ఉన్నవి ? జీవజాలం ఎంత ఉన్నది ? సముద్రజలంలో నీటి తుంపర లెన్ని ఉన్నవి ? ఆకాశంనుంచి కురిసే మేఘాల వర్షధారల లెక్క ఎంత?—నీ పుణ్యం లెక్కకూడా అంతేనయ్యా! మరొక్కమాటకూడా ఉన్నది. ఇప్పుడు నీవీ నారకులమీద చూపుతున్న జాలివల్ల అదంతా అతురెట్లు పెరిగింది నాయనా !"

విదేహరాజు చేతులు జోడించి దేవేంద్రుణ్ణి ఇట్లా ప్రార్థించాడు: "మహాత్మా, నా పుణ్యమంతా ఈ నరకంలో బాధపడేవాళ్ళకు పంచిపెట్టి వీళ్ళకీబాధ తప్పించి అనుగ్రహించు, మహాప్రభూ !"

ఆ ఉత్తరక్షణంలో మహాద్భుతం జరిగింది. నరకాలన్నిటిలో యాతనపడేవాళ్లు ఒక్కడూ లేకుండా అందరూ పరిపరివిధాల విదేహరాజు దయాబుద్ధిని పొగడుతూ నరకలోకం విడిచి పోతున్నారు. సంక్రాంతినాడు తెలుగుదేశంలో చెరసాలలవలెనే నరకాలన్నీ ఖాళీ అయినై.

విదేహరాజు ఇంద్రుడికీ ధర్మదేవతకూ కృతజ్ఞుడై భక్తితో మ్రొక్కి వారివెంట స్వర్గానికి బయలుదేరాడు.

(ఇంకావుంది)

# సంచీ-గిన్నె-చెప్పులు

ఒకఊళ్లో రామన్న అని ఒక పేద రైతు ఉండేవాడు. వాడికి భీమన్న సోమన్న కామన్న అని ముగ్గురు కొడుకులు. పెద్దవాడికి 15 ఏళ్లు, రెండోవాడికి 10 ఏళ్లు, మూడోవాడికి 5 ఏళ్లు. పాపం వాళ్లు చాల బీదవాళ్లవటంచేత తిండికి గడవటం కష్టంగా వుండేది. కొన్నాళ్ళయింతరవాత పెద్దవాడేమన్నాడంటే.

"నాన్నా నాన్నా, నేను పెద్దవాడినయ్యానుగదా, ఎక్కడికైనా పోయి ఏదైనా పని నేర్చుకునొస్తాను. వచ్చింతరవాత ఆ పనిమీద నేను బాగా డబ్బు సంపాయించవొచ్చు. నే పోతాను నాన్నా." అన్నాడు. "సరే బాగానే వుంది. వెళ్ళిరా నాయనా, డబ్బు సంపాదిస్తానంటే నేమాత్రం వద్దంటానా," అన్నాడు తండ్రి. సరే, భీమన్న, తల్లి యిచ్చిన అటుకులు, చద్దెన్నం, ఆవకాయ మూటకట్టుకుని బయద్దేరాడు. పోయిపోయి ఒక పెద్ద పట్టణంలో ఒక పెద్దషావుకారు దగ్గర గుమాస్తాగా చేరాడు. కొంచెం, లెక్కలు చాతయినవాడవటంచేత పద్దులు గిద్దులు రాస్తూ నెలకు 20 రూపాయలు సంపాయించేవాడు.

కొన్నాళ్లకి రెండోవాడైన సోమన్నకి కూడ డబ్బు సంపాయించుకు రావాలని బుద్ధిపుట్టింది. తండ్రితో చెప్పాడు తను కూడా అన్నలాగా వెళ్ళి ఉద్యోగం సంపాదిస్తానని. తండ్రి సరేనన్నాడు. సోమన్నకూడా చద్దిమూట కట్టుకుని పోయిపోయి ఒకఊళ్లో ఒక పెద్ద సత్రవులో ఎంగిలాకులు ఎత్తే నౌకరుగా చేరాడు. వాడికి అట్టే చదువురాదు గాబట్టి అంతేపని దొరికింది. వాడికి నెలకి పదిరూపాలిచ్చేవాళ్లు.

సామగానం సరస్వతీదేవి

అన్నలిద్దరూ చెరోదారీ పోయాక కుర్రకుంక కామన్నకి ఇంటిదగ్గిర ఏమీ తోచలేదు. తను కూడా దేశాలంబడిపోయి ఏమన్నా సంపాదించా లనుకున్నాడు. కాని వాడికి అయిదేళ్లకంటే ఎక్కువ వయస్సులేదు. మరితల్లి తండ్రులు ఒప్పుకుంటారా అంత చిన్నవాణ్ణి పంపించడానికి. వద్దనిచెప్పి ఊళ్లోనే ఒకళ్ళిట్లో పనికి కుదిర్చారు. కాని కామన్న ఊహాలు మహాపెద్దవి. హాఠాత్తుగా ఒకరోజున ఎవ్వరికీ చెప్పకుండా పారిపోయాడు. పోయిపోయి ఒక వూరిచివర ఒక మాదిగాడు కనిపించేటప్పటికి, వాణ్ణి "నా కన్నంకావాలి, ఆకలవుతోంది." అని అడిగాడు. ఆ పసివాడిని చూసేటప్పటికి వాడికి జాలేసి "సరే అబ్బాయ్" నీకు అన్నంపెడతాను. నాదగ్గరే వుండు. నాకు పనిలో తోడుపడుతూ వుండు." అన్నాడు.

ఇల్లా ముగ్గురూ మూడుచోట్ల పనుల్లో కుదురుకొని వుండగా పదేళ్లు గడిచాయి. భీమన్న షావుకారుదగ్గిర నమ్మకంగా పనిచేశాడు. పదేళ్లయింది కాబట్టి యింటికి వెళ్లి తల్లిదండ్రిని చూడాలనిపించింది. "ఇంటికి వెళ్ళిపోతానండీ" అని షావుకార్ని అడిగాడు. షావుకారు "అయ్యో, వెళ్లిపోతావా? నీలాంటి పనివాడు దొరకటం కష్టం. నీ తల్లిదండ్రుల్ని చూడాలంటున్నావు గాబట్టి సరే వెళ్లు ఇదిగో నీకొక సంచీ యిస్తున్నాను. ఈ సంచీని "సంచీ, సంచీ, డబ్బు" అని అడిగితే ఎంతడబ్బు కావలసినా ఇస్తుంది. తీసుకెళ్లి జాగ్రత్తగా వాడుకో" అని చెప్పి భీమన్నకి సంచి యిచ్చాడు. సంతోషంతో భీమన్న ఆసంచీని తీసుకొని ఇంటికి బయల్దేరాడు తనవూరు ఇంకా 8 మైళ్లు ఉండగా చీకటిపడింది. ఈచీకట్లో వెడితే దొంగలెవరేనా కొట్టేస్తారేమో," అనుకుని అక్కడ వున్న ఒక సత్రవులో దిగి, మకాం చేశాడు. కాని ఆసత్రవ అధికారి మహాదుర్మార్గుడు. ఇతర్ల దగ్గర ఏమన్నా వుందీ అంటే ఎల్లాగో ఓలాగు దొంగిలిస్తాడు. ఈసంగతి తెలియక భీమన్న "ఏమండోయ్, నాదగ్గిర డబ్బు లేదనుకోకండి. ఎన్ని లక్షలు కావలసినా నేనివ్వగల

నాకు మహారాజాభోజనం ఏర్పాటు చెయ్యండి." అన్నాడు. సత్రవఅధికారి బలేచాన్సు అనుకుని మహారాజా భోజనంపెట్టాడు. భోజనం చేసింతరవాత డబ్బిమ్మని అడిగాడు. భీమన్న గదిలోకి వెళ్లి "సంచీ సంచీడబ్బు" అనేటప్పటికల్లా డబ్బు కుప్పలుగా కురిసింది ఇదంతా కిటికీలోనించి సత్రవ యజమాని చూస్తూ కనిపెట్టాడు. భీమన్న యజమానికివ్వవలసినదిచ్చి తక్కిన డబ్బును మూటకట్టాడు.

ఆరాత్రి సుఖంగా నిద్రపోయాడు భీమన్న. కాని యజమానికి నిద్రపట్టలా. ఎల్లాగైనా డబ్బునంచీని కొట్టేయాలని దుర్బుద్ధి పుట్టింది. అప్పుడేం చేశాడూ. భీమన్నదగ్గిర ఉన్న సంచీలాంటిదే మరోసంచీ సంపాదించి, ఒకరాత్రి వేళ తలుపు తెరుచుకుని, భీమన్న సంచీ జాగాలో తనసంచీనిపెట్టి ఆ సంచీ లాగేసి తలుపుమూసి వెళ్లిపోయాడు. తెల్లవారింది. మారు సంచీని చూసి తన సంచీయే నను కున్నాడు భీమన్న. సరే, యజమానీతో వెళ్లివస్తానని చెప్పి తన వూరు బయల్దేరివచ్చాడు. వచ్చేటప్పటికి తల్లిదండ్రులు కొడుకును కావిలించుకున్నారు. "ఎన్నాళ్లకి కనుపించావురానాయనా ? ఏమేం నేర్చుకున్నావేమిటి" అని తండ్రి అడిగాడు. "చూస్కోండి ఒక తమాషా తెచ్చాను." అని సంచీ చూపించాడు భీమన్న. "ఏముంది ఈపాతసంచీలో. ఒట్టిదేగదా." అన్నాడు రామన్న.

"వట్టిదాంట్లోనించే డబ్బుపుట్టిస్తాను." అన్నాడు భీమన్న. అని పెద్దగొప్పగా "సంచీ, సంచి డబ్బు." అన్నాడు. అది డబ్బుసంచీ అయితేగా డబ్బు కురవడానికి. ఏమీ రాలేదు.

ఏమిటా అనుకుని మళ్లీ అన్నాడు భీమన్న. మళ్లీ పలకలేదుసంచీ. "సంచీ సంచీ డబ్బు"అని ఎన్నిసార్లు అన్నా వృథా అయింది. తెల్లపోయాడు మనిషి. తల్లిదండ్రులు నవ్వి వీడికి పిచ్చెక్కిందనుకున్నారు. పాపం భీమన్నకి ఏంజరిగిందీ తెలియక తెల్లబోయి కిమ్మనకుండా వూరుకున్నాడు.

ఇహ సోమన్న సంగతి.

కొన్నాళ్లు ఎంగిలాకులు ఎత్తాడు. తరవాత సత్రవ అధికారి వడ్డించే పని ఇచ్చాడు. పదియేళ్లు అయ్యాక "తల్లిని దండ్రిని చూడాలనిపిస్తోంది. కాబట్టి సెలవిప్పించండి." అని అధికారి నడిగాడు సోమన్న. సరేనని అధికారి ఒప్పుకున్నాడు. ఇన్నాళ్లూ నమ్మకంగా పనిచేశాడు కాబట్టి, వెళ్లేటప్పుడు ఏమీ ఇవ్వకపోతే బాగుండదని చెప్పి ఒక గిన్నె ఇచ్చాడు. ఆగిన్నని బోర్లిస్తే పంచభక్ష్య పరమాన్నాలు వస్తాయి. బావుందనుకున్నాడు సోమన్న, బయల్దేరాడు. చీకటి పడేటప్పటికి తన అన్న భీమన్న ఆగిన సత్రవుకే వచ్చాడు. "నాకు అన్నం అక్కర్లేదు, గదిమాత్రం కావాలి"అని యజమానినడిగాడు. అన్నం అక్కర్లేదంటాడేమా అని యజమాని ఆశ్చర్యపోయి, చక్కని గది నిచ్చాడు. ఏం తింటాడో చూద్దామని కిటికీసిడల్లో నుంచున్నాడు యజమాని. సోమన్న కూర్చుని గిన్నని బోర్లించాడు. వెంటనే

ప్రసిద్ధరచయిత:— వడేళ్ళ
కిందట నాకథ ఒకటి 25 రూపా
యలకి తీసుకున్నారు, జ్ఞాపకం
ఉందా ?

ఎడిటరు:— అవును. అ
ఇంకా ప్రచురించలేదు.

రచయిత:— ప్రచురించ
నక్కర్లేదు. 250 రూపాయ
లిస్తాను, నాకథ నాకిచ్చి
వెయ్యండి.

ఎడిటరు:—ఎందుకని?

రచయిత:— అప్పుడునాకు ఊరూ పేరూ లేదు. ఇప్పుడు చాలాపేరు వచ్చింది. ఆపేరు పోగొట్టుకోవడం నాకిష్టంలేదు.

పంచభక్ష్య పరమాన్నాలు వచ్చాయి. శుభ్రంగా తిని, త్రేవుమని త్రేన్చి పడుకొనినిద్రపోయాడు సోమన్న. కాని యజమానికి నిద్రపట్టక, సోమన్న గిన్నెలాంటి ఒక గిన్నని సంపాయించు ఒకరాత్రివేళ గదిలోకివచ్చి, తనగిన్నె నక్కడ పెట్టి సోమన్న గిన్నని లాగేశాడు. ఇదేమీ తెలియని సోమన్న మర్నాడు పొద్దున తనవూరు చేరుకున్నాడు. తల్లీ దండ్రీ కావిలించుకున్నారు కొడుకుని. వాడికి తొందరగా వుంది ఎప్పుడు గిన్నెమహిమ చూపిద్దామా అని. తల్లిని యీపూటకి అన్నం వండవద్దాన్నాడు. భోజనం వేళకి అందర్నీ కూర్చోమన్నాడు. పెద్ద ధీమాగా గిన్నని తండ్రి విస్తట్లో బోర్లించాడు. ఏమీ పడలేదు. భీమన్న విస్తట్లో బోర్లించాడు కాని ఏమీ పడలేదు. పోనీ తన విస్తట్లో నైనా పడుతుం



కొత్తరుచి

## సంచీ, గిన్నె, చెప్పులు

దేమోనని బోర్లించాడు ఊహూ అది తనదైతేగా వీడికి పిచ్చెక్కిందనుకుని అందరూ నవ్వారు తల్లి అప్పుడు లేచి అన్నం వండింది.

ఇహ కామన్న మాదిగవాడి దగ్గిర చెప్పులుకుట్టడం బాగా నేర్చుకున్నాడు పదేళ్లయింది తల్లిదండ్రుల్ని చూడాలనిపించి వెళ్లోస్తానన్నాడు మాదిగాడు నరేనని వూరికే పంపించటం బాగుండదనుకుని చెప్పులజత ఒకటి యిచ్చాడు అవి మాయచెప్పులు. అవి తొడుక్కున్నవాడికి ఏదైనా ఆపదవస్తే అవి రక్షిస్తాయి అంటే వాడిమీదికి ఎవరైనావస్తే బర్రున ఎగిరి ఎడాపెడా బాది వదిలిపెడతాయి.

కామన్న బయల్దేరి చీకటిపడేటప్పటికి తనవూరికి మూడుమైళ్లలో వున్న సత్రవు దగ్గిరికి వచ్చాడు డబ్బులేదుకదూ దగ్గిర అందుకని అన్నం తినకుండా కాసిని మంచినీళ్లు తాగి అరుగుమీద పడుకున్నాడు కొంతసేపయ్యాక యజమాని బయటికివచ్చాడు వూరికేనేవాడు భీమన్న సంచితోనూ, సోమన్న గిన్నెతోనూ కోటీశ్వరుడయ్యాడు అయినా బుద్ధిమారలేదు ఏదో ఒకటి దొంగతనం చేస్తేగాని వాడికి తోచదు నిద్రపోతున్న కామన్నవంక చూశాడు కాళ్ళకి చెప్పులున్నాయి నిద్రపోతున్నా చెప్పులు విడవకుండా పడుకున్నాడేమా అని ఆశ్చర్యంవేసి ఇందులో ఏదోకిటుకు వుందనుకున్నాడు. మామూలుగా బుద్ధి



పెద్ద పెరక్క

—ఫొటో. పి. వీరన్న, విజయవాడ.

గడ్డికరిచింది నెమ్మదిగా చెప్పులు లాగాడో లేదో చెప్పులు రెండూ
తీయటం మొదలెట్టాడు కొంచెం చివ్వున ఎగిరి ఎడాపెడా దవడలు

# సంచీ, గిన్నె, చెప్పులు

వాచేట్టు బాదేయటం మొదలెట్టాయి. కామన్న నిద్రపోతూనే వున్నాడు.

యజమాని దెబ్బలు తింటూ అక్కడే కేకలేస్తే కామన్న లేస్తాడేమోనని లోపలికి పరిగెత్తాడు. చెప్పులు వెంటబడి వీపూ, దవడలూ, ముక్కూ, మూతీ చితక్కొట్టేస్తున్నాయి. పట్టుకొందామంటే అందవు.

ఎక్కడికిపోయినా వెంటబడుతున్నాయి. నెత్తురు కారుతోంది నోట్లోంచి. వీపు వాచిపోయింది. బాబోయ్, బాబోయ్ అని కేకలేశాడు. అందరూ లేచారు. ఎవరికీ ఏమీ తోచక వాళ్లూ కేకలెయ్యటం మొదలెట్టారు. ఈ కేకలకి కామన్న లేచి చెప్పులు లేకపోవటం చూసి సంగతేమిటో తెలుసుకుందామని లోపలికెళ్లాడు. యజమాని కామన్న కాళ్ళమీద పడి "బాబోయ్ రక్షించు. తప్పు చేశాను. ఇహ నెప్పుడూ దొంగతనం చెయ్యను బుద్ధి వచ్చింది." అన్నాడు. కామన్న చేత్తో చెప్పులు పట్టుకొని తొడుక్కుని "నువ్విదివరకు దొంగతనం "చేశావా"అని అడిగాడు.

చేశాను. ఇద్దరు అమాయకుల దగ్గర్నించి ఒక డబ్బుసంచీ, ఒక అన్నపుగిన్నె దొంగిలించాను." అన్నాడు. "అయితే నాకియ్యి అవి" నేను తీసుకుపోతా"నన్నాడు.

"ఇవ్వకపోతే చెప్పులు నిన్ను చంపేస్తాయి." అని బెదిరించాడు. యజమాని ఏంచేస్తాడు? వచ్చి నట్లు తీసుకొచ్చి యిచ్చాడు. చూస్తే సంచీపాతది, గిన్నె చిల్లుది.

"దీంట్లో, ఏమున్నాయని దొంగిలించావు"అని కామన్న అడిగాడు.

"బాబూ! దీంట్లో, మహిమలున్నాయి." అని యజమాని ఆ మహిమలన్నీ కామన్నకు చెప్పాడు.

"సరే యిక నెప్పుడూ దొంగతనం చెయ్యకు. బుద్ధిగా వుండు" అని తెల్లారేక గిన్నె, సంచీలతో కామన్న స్వగ్రామం చేరుకున్నాడు. తల్లీ తండ్రీ కొడుకుని కావలించుకున్నారు. తల్లిని అన్నం వండద్దన్నాడు. తండ్రిని పనిలోకి వెళ్లవద్దన్నాడు. వాళ్లు సంగతేమిటని అడిగారు.

"ఏమీ లేదు నేను రెండువస్తువులు తెచ్చాను. అవి మనకు పంచ భక్ష్య పరమాన్నం, కావలసినంత డబ్బు యిస్తాయి." అని గిన్నె సంచీలు చూపించాడు.

"పోరా పిచ్చివాడా! నీ అన్నల్లాగే తెచ్చావు. మహిమలూ లేవు మాయలూ లేవు. వట్టి సంచీ డబ్బు నిస్తుందా? వట్టిగిన్నె అన్నం పెడుతుందా." అన్నాడు తండ్రి.

"అలా కాదు, నేను చూపిస్తాగా!" అని కామన్న సంచీ బోర్లించీ "సంచి, సంచీ, డబ్బు!" అన్నాడు. డబ్బు కుప్పలుగా కురిసింది.

విస్తట్లో గిన్నె బోర్లించాడు. రకరకాల ఆహారపదార్థాలు తయారయ్యాయి. తల్లీ, తండ్రీ, అప్పుడే పొలంలో పనిచేసి వచ్చిన భీమన్న, సోమన్న అంతా ఆశ్చర్యపోయారు.

ఒక స్కూల్లో ఇనస్పెక్టరు తనిఖీకి వెళ్లాడు: హిస్టరీక్లాసులో ఒక కుర్రాణ్ణిపిలిచి:

"అబ్బాయీ, ఏ యుద్ధమయినా సరే కరక్టుగా ఏసంవత్సరంలో జరిగిందో చెప్పు. నీకు గుర్తున్నది చెప్పు."

"1111 సం॥లో ఏయుద్ధము జరగలేదండీ"

—ప్రతాపరావు, విశాఖపట్టం.

అన్నం కడుపునిండా తిన్నారు. డబ్బుతీసి దాచారు. భీమన్న "నీకీ సంచి ఎక్కడిదిరా?" అని కామన్నను అడిగాడు. కామన్న తను సత్రవలో బసచెయ్యడం, సత్రవ యజమాని తన చెప్పులు దొంగిలించడం వగైరా సంగతులన్నీ చెప్పాడు. అప్పుడు భీమన్న, సోమన్న ఒక్కసారిగా "ఈ సంచీ నాదే", "ఈ గిన్నె నాదే" అని సంతోషంతో అరిచారు. "సత్రవ యజమానికి మహ బాగా బుద్ధి చెప్పావు" అని తమ్ముణ్ణి మెచ్చుకున్నారు. కామన్న భీమన్న సంచీ భీమన్నకి, సోమన్నగిన్నె సోమన్నకూ ఇచ్చివేశాడు.

వీటితో ముగ్గురు అన్నదమ్ములూ, వారి తల్లిదండ్రులూ గొప్ప భాగ్యవంతులయ్యారు. తోటిమానవులమెడ దయగా ఉంటూ, దానధర్మాలుచేస్తూ, అతిథులను సత్కరిస్తూ, ద్రోహం తలపెట్టిన వాళ్లకు చెప్పుదెబ్బలు బహుమానం చేస్తూ చాల ఏళ్లు సుఖంగా జీవించారు.



# పొరుగింటి కామమ్మ

త్రిపురనేని ప్రమీలకుమారి

అప్పుడు నాకు మరీ చిన్నతనం.

మానాన్నగారికి వుద్యోగంలో బదిలీఅయి మేమంతా మద్రాసు వచ్చాము. వచ్చీరాగానే మా చదువు చెడిపోతుందని మానాన్నగారు నన్ను బడిలో చేర్పించారు. నేను బడికి వెళ్లివస్తున్నానేగానీ నాకు అంతా కొత్త. నాపక్కన కూర్చునే పద్మిని ఒక్కతే నన్ను పలుకరిస్తూ వుండేది.

ఎందుకనో గానీ చూచినప్పటి నుంచీ మా మేష్టరుగారంటే నా కిష్టం వుండేదికాదు. ఎప్పుడూ రుసరుసమంటూ వుండేవారు. పిల్లలతో కలుపుగోలుతనంగా వుండేవారు కాదు. ఏదో లోకంలోనించి వూడిపడినట్లు వచ్చి పాఠంచెప్పి వెళ్లిపోయేవారు. పిల్లలెవరికీ ఆయనంటే యిష్టం వుండేదికాదు.

వొకరోజు నేను పాఠం చదువుకోకుండా బడికి వెళ్లాను. ఈ సంగతి నాముఖంమీద రాసినట్లు కనిపించిందో ఏమో ఎన్నడూ అడగని పంతులుగారు ఆరోజునే నన్ను పశ్నలపై ప్రశ్నలు అడగటం మొదలుపెట్టారు. నేను వొక్క ప్రశ్నకూ జవాబు చెప్పలేకపోయాను. దానిమీద ఆయన నాచెవి మెలిపెట్టి దండించారు. అంతమంది పిల్లల్లో నన్ను అవమానపరచినందుకు నాకు చాలా కష్టం వేసి చాలాసేపు ఏడ్చాను. ఆయన నన్ను దండించి ఏమీ జరగనట్లుగా పాఠం ముగించుకొని వెళ్లిపోయారు. అది నాకు మరీ కష్టం కలిగించింది.

*   *   *

బడి విడిచిపెట్టగానే ఇంటికి బయలుదేరాను. ఇంకా నాకళ్ల వెంట నీళ్లు కారుతూనే వున్నాయి. ఏదోఒక విధానప్రతీకారం చెయ్యాలని కోర్కె మనస్సులో సెలవేస్తూ వుంది. ఆసమయంలో పద్మిని పరుగెత్తుకుంటూ వచ్చి నన్ను ఓదార్చింది. ఆపిల్ల ఓదార్చినకొద్దీ నాకు ఏడుపు ఎక్కువయింది. చివరికి ఆ పిల్ల "రేపు ఒకపని చెయ్యి, అతని రోగం కుదురుతుంది;" అన్నది.

"ఏమిటి ?" అన్నాను.

"అతను క్లాసులోనికి రాగానే అతనికి వినిపించేటట్లు 'పొరిగింటి కామమ్మ' అను," అన్నది. 'పొరుగింటి కామమ్మ' అంటే రోగం కుదరటం ఎందుకో ?

నేను కారణం అడిగాను. కారణం ఆ పిల్లకీ తెలియదట. "కానీ ఈ మాట వినగానే ఆయన హడలిపోవటం తథ్యం," అన్నది. కోపం వచ్చినప్పుడల్లా పిల్లలు ఆలా చేస్తూ వుంటారని చెప్పింది. నాకు ఈపని బాగానే వున్నదనిపించింది. కష్టమయిన పనికూడా కాదు.

ఆమరునాడు కొంచం తొందరగా బడికివెళ్లి బోర్డుమీద సీమసున్నం ముక్కతో, "పొరుగింటి కామమ్మ" అని రాసి ఏమీ ఎరగనట్లు కూర్చున్నాను. పిల్లలు వొక్కొక్కరే వచ్చి బోర్డుమీద అక్షరాలు చూచి ఎవరికివారు కిక్కురు మనకుండా కూర్చున్నారు. ఇంతలో పంతులుగారు వొచ్చి మామూలుగానే పాఠం చెప్పటం మొదలుపెట్టారు. ఏదో రాయబోయి బోర్డు దగ్గరకు వెళ్లారు. చెపితే మీరు నమ్ముతారో లేదో గజగజావణికిపోయారు. కెవ్వున కేకవేసి పైపంచ ముఖంమీద కప్పుకొని క్లాసులోనించి పరుగెత్తుకెళ్లారు.

*   *   *

ఆయన వెళ్లిపోగానే పిల్లలంతా గొల్లుమన్నారు. నా చుట్టూ జేరి నన్ను మెచ్చుకొన్నారు. అతని రోగం బాగా కుదిర్చావన్నారు. నాకు చాలా సంతోషం వేసింది. మా పంతులుగారు ఆ దెబ్బతో నాలుగురోజులు బడికిరాలేదు. చివరకుఒకరోజుశల్యావస్తలోవచ్చారు. ఆయన్ని చూస్తే అప్పుడు నాకు కొంచం జాలివేసింది. ఆయనకు అంతబాధ ఎందుకో నాకప్పట్లో అర్థం కాలేదు.

*   *   *

కొన్నాళ్ళకు మేము వుండే యిల్లు మారవలసివచ్చింది. ఆ కొత్తయిల్లు మా మేష్టరుగారింటి దగ్గరే. ఆయింట్లోకి వెళ్ళిన తరువాత మా మేష్టరుగారి బాధకు కారణం నాకు తెలిసింది. కామమ్మ అనేపిల్ల మా పంతులుగారింటి పక్కయింట్లో వుండేదట. ఆ పిల్లా మా పంతులుగారూ ప్రేమించుకొన్నారట. వారిద్దరూ వివాహం చేసుకుందామని నిశ్చయించుకొన్నారట. కానీ, ఆపిల్ల తల్లిదండ్రులు అంగీకరించక ఆమెను బలాత్కారంగా వేరొకనికిచ్చి

# మా అన్నయ్య బి. యిడి. చదువు

ఏ తెరువు లేకపోతే బడిపంతులు బెస్ట్ అన్నారు. అక్కడికి అదొక సులభమైన పని అన్నట్టు. కాని మా అన్నయ్య బి. యిడి. చదివే అవస్థ చూస్తే అసలు బడిపంతులు ఎట్లా అవడమా అనేది పెద్ద సమస్యగా కనపడింది.

మా అన్నయ్య బి కామ్. ప్యాసయి ఏవో కొన్ని చిన్నచిన్న ఉద్యోగాలు వెలిగించాడు. బ్రహ్మ చెప్పినదే వేదము; బుద్ధుడు చెప్పినదే నీతి అన్నట్టు—ఎవరు చెప్పిపెట్టారో కాని మా నాన్నగారు ఒకనాడు అమాంతంగా ఇంటికివచ్చి మా అన్నయ్యను బి. యిడి. చదివితే మాష్టరు ఉద్యోగం నుండి స్కూళ్ళ ఇనస్పెక్టరు కూడా అవచ్చని బలవంతంగా వాడిని బి. యిడి. లో చేర్పించారు. మొదటి రోజులలో చదువేమీ లేదుకాబట్టి మా అన్నయ్య మంచి హుషారుగా తిరిగేశాడు. కాని క్రమంగా పాఠాలు మొదలెట్టిన తరువాత వాడి అవస్థ చూస్తే నిజంగా నాకే చాలా జాలి వేసింది. ఎందుచేతంటే, వాడు చదివే చదువుకి చేయబోయే పనికి కొంచంకూడా సంబంధం కన్పించలేదు. పోనీ డిగ్రీకోసం ఏ చదువైతేనేం అంటారేమో—ఆ చదువైన కొద్దిగా పరిమితి అనేది ఉంటే ఇంత గొడవ లేకపోను. ఏవో రికార్డులలో అవసరమున్నవి లేనివి

వై. సరస్వతీ దేవి

కూడా ప్రతి బొమ్మ వెయ్యాలట. కాకిఈకలు, కోడిఈకలు, ఆకులు, పువ్వులు, లతలు, లేసులు—అవీ, ఇవీ అని లేదు—ఏవైనా సరే—ప్రతీది అమాంతంగా రికార్డులోకి ఎక్కవలసిందే. ఇవన్నీ మీకెందుకురా అని అడిగితే, వాడికే కాదు ఆ మాష్టర్లకే తెలీదు అంటాడు మా అన్నయ్య.

పోని వాడి చదువేదో వాడు చూసుకుంటే నాకు ఈ గాథ వ్రాయవలసిన అవసరమే లేకపోను. వాడికి మేం పదిమందీ ఏజంట్లుగా ఈ అర్థం లేని పనిచేసినా చాల లేదు. అందులో మా సంసారం కొద్దిగా పెద్దదేమో ఆమాత్రమైన జనం ఉన్నారు. లేని వాళ్ళ గతి ఏమైందో పెరుమాళ్ళకెరుక. బొమ్మలు, మేపులు వెయ్యడానికి వాడికి తిరుబడిలేక మా పెద్దన్నయ్యను దానికి ఏజెంటుగా చేశాడు. కాగితం పువ్వులు, అట బొమ్మలు చెయ్యడం, అల్లికలు అల్లడం మొదలైన పనులు నాకు అంటగట్టాడు. నూలువడకడం మా అమ్మకి అప్పగించాడు. ఇంక చిన్న తమ్ముళ్లూ, చెల్లాయిల హడావుడి వేరే చెప్పనక్కర్లేదు. ఈకలు, బొమ్మలు, పోస్టు బిళ్ళలు మొదలైనవి ఎక్కడ కనపడినా సరే పట్టుకరమ్మనేవాడు. వాటి నన్నింటినీ వేరువేరుగా బొమ్మల పుస్తకాలలో అతికించడానికి ఇంకొకరిని పురమాయించాడు.

ఒకమారు మా యింటికి ఎవరో పెద్దమనిషి వచ్చారు. ఆయన చేతిలోని పుస్తకం మా తమ్ముళ్లు, చెల్లెళ్ల దృష్టిలో పడింది. ఆయన పుస్తకం కొంత చదివి బల్లమీద



వివాహం చేశారట. ఆమె ఈ ఎడబాటు సహించలేక ఆత్మహత్య చేసుకుందట. ఎంత ఘోరం!

నాకీసంగతి తలుచుకున్నప్పుడల్లా ఇప్పటికీ కళ్లవెంట నీళ్లు తిరుగుతై. చిన్నతనంలో తెలియక ఎంతతప్పు చేసిందీ యిప్పుడు అర్థమవుతూవుంది. 'నేను చేసినతప్పుకు, మాష్టరుగారికి కలిగించినవేదనకు, ప్రాయశ్చిత్తం లేదు' అనిపిస్తుంది ఇప్పుడు.

అది నాకు చిన్నతనం. ★

పెట్టారు. వీళ్లు మెల్లిగా ఆ పుస్తకాన్ని వేరే గదిలో మూలకి తీసికెళ్లి దాన్ని పూర్తిగా చిత్రవధ చేసి తిరిగి యథాస్థానంలో దానిని పడేశారు. ఆయన మళ్ళీ పుస్తకం తెరిచేటప్పటికి దానినిండా పెద్దపెద్ద కన్నాలు కనిపించాయి. ఏం చేస్తాడు? పాపం! సంగతంతా ఆయనకే అర్థమైంది. పుస్తకం పాడైందనే బాధతో ఆయన మా అన్నయ్య చదువుని కొద్దిగా స్తోత్రంచేసి వదలిపెట్టారు.

నిజంగా వాడు బడినుంచి ఇంటికి వచ్చాడంటే చాలు — మా కందరికీ ఏదో భయంగా వుండేది. ఎందుచేతంటే రోజురోజుకీ ఈ అర్థంలేని పని పెరిగిపోతోంది. అది వచ్చి మా అందరిమీదా పడుతోంది. ఇంత పని చేస్తూంటే వాడి మాష్టర్లు ఊరుకోకుండా వాడి బొమ్మలు బాగున్నాయని ఇంకా కొన్ని ప్రదర్శనంలో పెడతామని వెయ్యమన్నారు. ఏవో మట్టి బొమ్మలు కూడ తయారు చేయమన్నారు. పాపం! వాడు కూడ మా శ్రమ చూసి చాలా బాధపడ్డాడు. కాని ఏం చేయగలడు—వాడిని చూసి మేము, మమ్మల్ని చూసి వాడు విచారించాలే కాని. ఈ బి. యిడి. వాళ్ళ పాట్లు అధికార్లు కొంచెం విచారించి ఈ చదువును తగ్గిస్తే బాగుండును.

వీడి పనితో ఇంట్లో ఎవళ్లకీ విశ్రాంతి అనేది ఉండేది కాదు. పెళ్లి వారిలాగ ఏదో పెద్ద ఘనకార్యం చేస్తూన్నట్లు ఉండేవాళ్లం. కొంపతీసి ఇంటికి ఎవరైనా వస్తే పెద్ద చిన్న తారతమ్యం లేకుండా వారికి ఒక డ్యూటీ పడేసేవాళ్ళం. ఇంతకీ బి. యిడి. మా అన్నయ్య చదువుతున్నాడా లేక మేమా అనిపించేది. వీడి చదువు ఎప్పుడు పూర్తి అవుతుందా - ఎప్పుడు విశ్రాంతిగా నిద్రపోదామా అని మేమందరం వెయ్యి దేముళ్లకి మొక్కుకొనే వాళ్లం.

ఎట్లా అయితేనేం—బి. యిడి. చదువు పూర్తయిందనిపించాము. కాని మాకు పట్టుకున్న సందేహమేమంటే—ఇంతకీ ఈ బి. యిడి. లందరికీ, కనీసం ఈ పడిన శ్రమకైనా బడి పంతులు ఉద్యోగం ఇస్తారా లేదా అని. ఇంకమాత్రం మా యింట్లో ఎవళ్లూ బి. యిడి. చదవకూడదని మేమందరం గట్టిగా శపథం చేసుకొన్నాం.





'పల్లెపడుచు'లో రామశర్మ, సి. యస్. ఆర్.



'రాజా-పేదా'లో ఒక ఘట్టం.

# ★ వాహినీవారి పెద్దమనుషులు ★

మార్చి 11వ తేదీని ఆంధ్రదేశంలో విడుదలైన వాహినీ పిక్చర్స్ వారి 'పెద్దమనుషులు' 28వ తేదీని వాహినీ స్టూడియోలో పత్రికా ప్రతినిధులకు తిరి తెరలకు చూపబడింది. శ్రీ కె. వి. రెడ్డిగారు డైరెక్ట్ చేసిన ఈ చిత్రంలో గౌరీనాథశాస్త్రి, లింగమూర్తి, రేలంగి, శ్రీరంజని, పద్మావతీదేవి, హేమలత మొదలైనవారు నటించారు. శ్రీ డి. నరసరాజుగారు సంభాషణలు రచించారు. ఇబ్సెన్ ప్రసిద్ధ నాటకం "పిల్లర్స్ అఫ్ సొసైటీ" లోని కథను ఆంధ్రదేశపు వాతావరణానికి అనుకూలంగా మార్చారు. అయితే ఇలాటి మార్పులో సంభవించే అతకని అంశాల్ని సంభాషణలు వ్రాసిన నరసరాజుగారి చాకచక్యమూ, డైరెక్టర్ రెడ్డిగారి నైపుణ్యమూ కొంత కప్పుకున్నాయి. ఆయా పాత్రల నిరూపణకూ, అనేక సన్నివేశాలను కథలో అమర్చడానికీ నరసరాజుగారి రచన ఎంతో తోడ్పడింది.

ఈ చిత్రాన్ని గురించి వివిధాభిప్రాయాలను తెలుపుతూ కొందరు ప్రేక్షకులు వ్రాసిన వ్యాసాలలో ఒకదానిని ఇక్కడ ప్రచురిస్తున్నాము.

## ఊరూరా పెద్దమనుషులు, ఊరికో తిక్కశంకరయ్య.

'వస్తున్నారు, వస్తున్నారు' అన్న పెద్దమనుషులు ఆంధ్రదేశానికి వచ్చి అప్పుడే రెండు వారాలు దాటింది. వీరి వాలకం చూస్తే, యింకొక రెండు మూడు వారాల పాటు యిక్కడే తిష్ఠ వేసేటు కూడా వున్నారు. ఒక్కొక్క రోజు, రోజుకి మూడుసార్లు చొప్పునా, మిగిలిన రోజుల్లో రోజుకి రెండుసార్లు చొప్పునా వీరంతా కలిసి ఆడుతున్న నాటకమూలంగా ఆంధ్రదేశంలో యీరోజున ఎవరినీ పెద్దమనిషి అని ఎదురుగా నిలబడి అనటానికి ఆస్కారం లేకుండా పోయింది. ఇంతవరకు ఎవరినైతే పెద్దమనుషులనుకొంటున్నామో వారందరినీ యిక వదిలేసి, పెద్దమనుషులకోసం సాదా ప్రజల నడుమ వెతుక్కోవాలి కాబోలు!

ఏమిటో అనుకుంటాం కాని—నిజానికి గౌరవం, హోదా, ప్రచారం అన్నీ 'పెద్దమనుషుల'కే, సుమండీ! నాటకరసిక మండలి — వాహినీవారి పెద్దమనుషులు "ప్రోప్రైటర్లు" చాలామటుకు, పాటల పుస్తకంమీదా, పూర్తిగా ఆ చైర్మన్ ధర్మారావు, ఆయన వంగుడాడు 'మెంబర్లు' నాగోజీ, అవతారం, సిద్ధాంతిగార్లవే బొమ్మలున్నాయి. అయినా 'స్టాటా' చేయలేదనే కాబోలు, పాపం — ఆ పేద ప్రజాసేవ పత్రికా సంపాదకుడు రామదాసుగారి బొమ్మ పుస్తకంమీద వెయ్యలేదు.

రామదాసుగారు కోర్టులో కొనిక్కి ధర్మాధర్మాలు నిర్ణయించేవాడు, పాపులకు శిక్ష వేసేవాడు ఆ భగవంతుడున్నాడన్నప్పుడు, మాకూ అలాగే అనిపించింది కాని, నలుగురు పెద్దమనుష్యులూ కలిసి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను భోంచేస్తున్నప్పుడూ, ఆది కేశవస్వామిని అసింటా తప్పుకోమని వాళ్లపని వాళ్లు కానిస్తున్నప్పుడూ ఆ భగవంతుణ్ణి చూస్తేనే తగని జాలివేసింది. మనతోపాటు దేవుణ్ణిచూసి జాలిపడ్డవాడు — తిక్కవాడైతే అయినాడు కానీ, — శంకరానంద స్వాములవారు ఒకడున్నాడు.

చైర్మన్ గారు దేవాంతక నరాంతకులు. దేవుణ్ణి సరే, వెళ్లగించి మూలకు పెట్టారు. ఆ త్రిలోకపతుని తమ్ముణ్ణి తెచ్చినా డని పూ

, డేవిడ్, బాండ్ బర్ట్, హీరా మొదలైన వారు నటించారు

ముష్టియెత్తుకోడం కూడనిపని అనీ, ఎవరి అదృష్టం వారిచేతిలోనే ఉందనీ సందేశమిస్తూ ఈ చిత్రం నిరాశ్రయులైన పిల్లలు ఏం చెయ్యాలో తెల్పుదు చిత్రంలో మాత్రం బూట్ పాలిష్ చేసి బ్రతకాలనే పట్టుదలతో అనేక కష్టాల నెదురుకొన్న అన్న చెల్లెళ్ళను పిల్లలు లేని ధనవంతులైన దంపతులు పెంచుకుంటారు అంతే

కథాంశం: తల్లిదండ్రులు లేని అన్నచెల్లెళ్ళు భోలా, (రతన్), బేలూ (బేబీ నాజ్) కమలా చాచీ (చాంద్ బర్క్) పాల బడతారు బొంబాయిలో పడుపువృత్తి వల్ల జీవించే కమలా చాచీ ఈ యిద్దరినీ ముష్టియెత్తి డబ్బులు సంపాదించుకు రమ్మని బాధిస్తూ ఉంటుంది త్రాగుబోతైనా మంచి అంతఃకరణ కల పొరుగు మురికివాడు జాన్ చాచా (డేవిడ్) ఆ మురికివీధుల్లోని బాల బాలికలందరినీ పోగుచేసి ముష్టియెత్తుకో కూడదనీ, చేతనైన పనేదో చేసుకుని జీవనాధారం సంపాదించుకోవాలనీ బోధిస్తూ ఉంటాడు జాన్‌చాచా బోధవిని భోలా, బేలూ వీధుల్లో తిరిగి బూట్లు పాలిష్ చేస్తూ డబ్బు సంపాదించడానికి ప్రయత్నిస్తారు ముష్టెత్తాలని నిర్బంధించి కమలాచాచీ పెట్టే బాధలూ, పనిదొరక్క డబ్బులులేక పడే ఆకలి బాధల వల్ల అన్నా చెల్లెళ్ళ సంకల్పం చలించదు నానాకాలంలో రాత్రిగా పని లోపించి ఆకలికి తాళలేని స్థితిలో ఒకరోజున అన్నా చెల్లెలూ విడిపోతారు బిడ్డలులేని ధనవంతులైన దంపతులు చెల్లెలు బేలూను పెంచుకుంటారు జైలులోగా త్రాగుబోతులైన జాన్ చాచా ఏడాదిపాటు జైలు శిక్ష అనుభవించివచ్చి భోలానికూడా ఆ ధనవంతులవద్దకు చేర్చడంలో తోడ్పడతాడు ఈ చిత్రంలో బేబీనాజ్ అభినయం అత్యంతరమణీయంగా ఉంది ★

# సినిమా వార్తలు

భారతదేశ చలనచిత్ర పరిశ్రమలో ఉత్తమ చిత్రాలను ప్రోత్సహించడానికి గాను 'ఫిల్మ్ ఫేర్' వారు నెలకొల్పిన 'ఫేర్' బహుమతులు మార్చి 21 వ తేదీని బహూకరించబడినాయి హాలీవుడ్ లో 'ఆస్కార్' బహుమతుల మాదిరి కాక ఇక్కడ ప్రేక్షకుల బాలట్ ఫలితాలనుబట్టి బహుమతులు నిర్ణయించబడినాయి నిర్ణయాలను ప్రేక్షకులకు విడిచిపెట్టినా మేలుగానే ఉన్నాయని ఆ పత్రిక అధిపతులు ప్రశంసించారు బహుమతులను కొందరు ప్రాతకులచేత ఇప్పించారు ఈ ఉత్సవానికి అమెరికన్ రాయబారి జార్జి వి ఏలెన్ అధ్యక్షత వహించారు

బహుమతులు పొందినవారు

1 ఉత్తమచిత్రం 'దో బీఘా జమీన్'—నిర్మాత బిమల్ రాయ్

2 ఉత్తమ దర్శకుడు—బిమల్ రాయ్

3 ఉత్తమనటి—మీనాకుమారి

4 ఉత్తమ నటుడు—దిలీప్‌కుమార్

5 మంచిపాట—'తు గంగా కీ మౌజ్' (బైజు బావ్‌రా)—నౌషద్

భారతదేశ మంతటా నిర్వహించబడిన బాలట్ కావడంవల్ల దక్షిణ భారతదేశంలో నిర్మించబడిన తెలుగు, తమిళ చిత్రాలకు ఈ బహుమతులలో స్థానం లభించకపోవచ్చు కాబట్టి మద్రాసు చిత్రాలకి వేరే బహుమతుల సంగతి ఆలోచించడం మేలు.

* * *

ఆనందా ప్రొడక్షన్స్‌వారు 'మేలుకొలుపు' అనే చిత్రాన్ని ప్రకాశ్ స్టూడియోలో తెలుగు తమిళ భాషల్లో తీస్తున్నారు డైరెక్టరు ప్రకాశరావు, కథ సంభాషణలు ఆత్రేయ, శ్రీశ్రీ సంగీతం పెండ్యాల జి వరలక్ష్మి, శ్రీరామ్, జమున, సి యస్ ఆర్, సుందరమ్మ, లంక సత్యం, మిక్కిలినేని, కుటుంబరావు, రమణారెడ్డి, సుధాకర్ మొదలైనవారు నటిస్తున్నారు

* * *

శరత్ చంద్రుని 'పరిణీత' నిర్మించిన అశోక్ కుమార్ ప్రొడక్షన్స్ ఇప్పుడు శైలజానందముఖర్జీ కృతి 'సమాజ్' చిత్రంగా తీస్తున్నారు ఈచిత్రంలో అశోక్‌కుమార్, ఆషా, ఉషాకిరణ్, అనూప్‌కుమార్, శశికళ, నజీర్ హుసేన్ మొదలైనవారు నటిస్తున్నారు



'బంగారు పాప' ప్రారంభోత్సవ సందర్భంలో [illegible] ఫోటో



# యోగాసనములు-దేహారోగ్యము

## 11. ఆహార నియమములు

ఈ వ్యాసమందలి యంశములు హఠయోగ ప్రదీపిక, ఛాందోగ్యోపనిషత్తు, శ్రీ భగవద్గీతలనుండి గ్రహింపబడినవి. ఈ చెప్పబోవు ఆహారనియమములు సామాన్యముగా యోగాంగాభ్యాసులందరికి అన్వయించ గలవేననూ, రోగపీడితులకు మరికొన్ని విశేషనియమములు గలవను విషయమును పాఠకులు మఱువరాదు.

పూర్వకాలమందు భారతీయులు దీర్ఘాయురారోగ్య సంపదలతో వృద్ధిపొంది అసాధారణ ప్రజ్ఞాశాలురై శాంతి, ఏకాగ్రత, ఆత్మధ్యాన పరాయణులై జీవితములను సార్థకపఱచుకొనిరి. ఇప్పటికినీ అట్టివారు లేకపోలేదు. ఇందుకు వారి ప్రధానమైన సాధనము ఆహార సేవనమందు నియమముల ననుసరించుటయే.

ఛాందోగ్యోపనిషత్తులో తండ్రియైన ఉద్దాలక మహర్షి పుత్రుడైన శ్వేతకేతువున కిచ్చిన ఉపదేశ మిట్లున్నది: "అన్నమయంహి సౌమ్యమనః ఆపోమయః ప్రాణః తేజోమయీవాక్ ఇతి" అనగా ఏకాగ్రతనుగాని మనశ్చాంచల్యమునకుగాని మనము భుజించు ఆహారము కారణము. ఎట్టి ఆహారమును భుజింతుమో అట్టిదే మనోవ్యాపారము. ప్రాణశక్తికి, అనగా ఆయుర్వృద్ధికి మనము త్రాగునీరు ఆధారము. ఆ నీరు స్వచ్ఛమైనది తీపిగల్గినదియై యుండవలెనేగాని, ఖురదమయముగాగాని ఉప్పగాగాని ఉండరాదు. వాక్శక్తికి కారణము ఆవు నెయ్యి, ఆవు పాలు, ఆవు పెరుగు ఆధారము. ఆపత్కాలమందు గేదెపాలు మొదలైనవి స్వీకరించవచ్చునేగాని పాలపొడులు, వనస్పతి నూనెలు పనికిరావు.



"ఆహార శుద్ధౌ సత్త్వ శుద్ధిః సత్త్వ శుద్ధౌ ధ్రువా స్మృతిః స్మృతిలంభే సర్వ గ్రంథీనాం విప్రమోక్షః" అనగా శుద్ధమైన సాత్త్వికాహారమును సేవించుటవల్లనే మనస్సు ప్రశాంతముగను, శరీరము ఆరోగ్యవంతముగను ఉండగలవు. మనస్సు పరిశుద్ధముగానుండి శరీరము ఆరోగ్యవంతమై వికసించుచున్నప్పుడుగాని స్మరణశక్తి కలుగదు. స్మరణశక్తి వృద్ధి అయినప్పుడే తరచు కలుగు సందేహములు తమంత తాము నివృత్తి కాగలవు. సందేహగ్రస్తులు వదలినచో ప్రజ్ఞ వృద్ధి చెందును.

**టి. కృష్ణమాచార్య**

శ్వేతకేతువున కీరీతిగా తండ్రి యుపదేశించినట్లు ననుబోలు వేదాన్తులు ఉపన్యసింతురేగాని ఆచరణలో బెట్టువారు చాల యరుదని చెప్పుటలో దోషములేదు.

హఠయోగ ప్రదీపికలో నిట్లు చెప్పబడినది.

"అభ్యాసకాలే ప్రథమం శస్తం
క్షీరాజ్య భోజనం
తతోభ్యాసే దృఢీ భూతేన
తాదృక్ నియమగ్రహః"

అనగా యోగాంగాభ్యాసములను మొదలుబెట్టినవారు ప్రారంభదశలో ఆహారమందు పాలు నెయ్యి విశేషముగా కలిపి భుజించవలెను. యోగాంగాభ్యాసము సమృద్ధమైన పిమ్మట అంత అధిక మవసరము లేదు. ప్రారంభదశలో యోగాసన ప్రాణాయామాదులవలన మాంస పిండములు ఎండిపోయినయెడల మలబద్ధము సంభవించి అనారోగ్య కారణమగును గనుక పాలను నేతిని అధికముగా సేవించవలసిన యవసరము గలుగుచున్నది పాలు నెయ్యి అనగా పాలపొడిలో తయారుచేయబడిన పాలు కృత్రిమములైన నూనెలు మాత్రము కావు కాలమానమునుబట్టి ఇట్లు వ్రాయకతప్పదు. దృఢారోగ్య దీర్ఘాయుష్య చిత్తైకాగ్రతలు అందరికిని అవసరములేవని యిట్లు వ్రాసితిని ఇవి లేక సంసారములో సుఖము దుర్లభము. ఇది ప్రపంచమును చూసి గ్రహించగల్గువారికి చెప్పుట యనవసరమే.

హఠయోగ ప్రదీపికలోనే "గోధుమ శాలియవ షాష్టిక శోభనాన్నం దివ్యముదకంచయమీంద్ర పథ్యం" అని చెప్పబడినది. అనగా బుడ్డగోధుమలు, జవగోధుమలు, సన్నబియ్యము, అరవై దినములలో ఫలించు బియ్యము, వీని అన్నము, భక్షణములు, పెసరపప్పు, పొన్నగంటికూర, మత్స్యాక్షికూర, ఎఱ్ఱబొద్దికూర, పొట్లకాయ, కందగడ్డ, బూడిద గుమ్మడి, లేత వంకాయ, పులిచింతాకు, అగిసె (అవిసె) పువ్వు కాయ, సైంధవ లవణము, జీలకఱ్ఱ, మిరియాలు, పచ్చిశొంఠి, (అల్లము), కలకండ, వెన్న, తేనె వీనిని ముఖ్యముగా సేవించవలెను. వీని ప్రత్యేక గుణవర్ణనము అనవసరమని విరమించుచున్నాను.

ఇవిగాక మరికొన్ని నియమములు: చన్నీళ్లస్నానము పనికిరాదు. నూనెతో చేసిన పదార్థములు భుజించరాదు. కారము, పులుపు అధికముగా వాడరాదు. ఎఱ్ఱగడ్డలు, తెల్లగడ్డలు (ఉల్లిపాయలు) విసర్జించవలెను. అత్యంతికమైన ఉపవాసముకూడదు. విశేషమునడక పనికిరాదు. నిప్పువద్ద చలి కాచుకొనకూడదు. జితేంద్రియత్వ మవసరము.

"ఉత్సాహాత్ సాహసాత్ ధైర్యాత్
తత్త్వజ్ఞానాచ్చ నిశ్చయాత్
జనసంగ పరిత్యాగాత్
షడ్భిర్యోగః ప్రసిధ్యతి"

సంతోషము, సత్ప్రయత్నము, ధైర్యము, సత్యాసత్యవివేకము, ఏకాంతవాసములచేత యోగము సిద్ధించును.

"అత్యాహారః ప్రయాసశ్చ
ప్రజల్పో నియమగ్రహః
జనసంగశ్చ లౌల్యంచ
షడ్భిర్యోగో వినశ్యతి"

ఎక్కువగా తినుట, విశేష శరీర పరిశ్రమ (అనగా పరుగెత్తుట, ఎక్కువ భారము మోయుట) వ్యర్థవాద వాక్కలహములు, వ్రతోపవాసాదులచే అనవసరముగ శరీరమును శుష్కింపచేయుట, అసభ్యజన సహవాసము, చిత్తచాపల్యము—వీనివలన యోగము స్వాధీనము కానేరదు.

రోగములవలన బాధపడువారును, చికిత్స చేయువారును యోగశాస్త్రమందు చెప్పబడిన నియమములకు వాతావరణమునుబట్టి లోబడుట మేలు. స్త్రీలు ఋతుకాలమందును, ప్రసవకాలమందును, గర్భిణి యవస్థలోను ఈ నియమముల ననుసరించరాదు. అనుసరించినచో వారి శరీరధర్మము, గర్భకోశము చెడగలవు. [సశేషము.]

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 179. కృష్ణదేవరాయలు తెలుగువాడా ?

కాడని కన్నడులవాదము విజయనగరము నేడు కన్నడ దేశములో ఉన్నది అక్కడి పాటకజనములకు తెలుగురాదు. ఆంధ్ర ఇతిహాస పరిశోధకమండలివారు విజయనగర సామ్రాజ్యోత్సవము చేసుకొన్నప్పుడు కన్నడ యువకులు అల్లరిచేసిరట "కృష్ణ దేవరాయలు కన్నడుడేన"ని విజయనగర సామ్రాజ్యస్థాపక గురువు విద్యారణ్యస్వామి కన్నడుడేనని కుందూరి ఈశ్వరదత్తుగారు సాక్ష్యమును చూపించినారు కృష్ణ దేవ రాయల అన్న పేరులోని 'దేవరాయలు' అన్న పదమూ, తిమ్మరుసు అనే పేరులోని 'అరుసు' శబ్దమూ కన్నడసాంప్రదాయము లోనివే కృష్ణదేవరాయల తమ్ముడు 'అచ్యుత దేవరాయలు'

కృష్ణరాయల ఇంటి పేరు 'తుళువ' వారని కొందరంటారు అంటే 'తుళు' దేశమునుంచి వచ్చిన వారని అర్థము తీయ వచ్చును పోర్చుగీసు విలేకరి యొకడు "కృష్ణరాయల కుటుంబములో మాట్లాడు నది దక్షిణదేశభాష యేదీకాదు" అని వ్రాసెట. ఈరెండు సంగతులూ కృష్ణ ...లు 'తుళు' దేశమువాడనడానికి ...యి 'తుళు' భాషకి నేటికీ ...లిపిలేదు నాటికి లేకపోవడము ...మిటి? లిపిలేని స్వభాషను కాక, ...హిత్యమూ కల తెలుగూ, కన్న ...సంస్కృతమూ పట్టి ఆయన పోషిం ...వచ్చును గదా ?

చూడగా కృష్ణదేవరాయలు ...లే అనిపిస్తున్నది కారణాలు ...ముందు కన్నడుడా అన్న అను ...ర్చిమాటలు రెండు చెప్పాలి ...మునకు ముందు విజయనగర ...జులలో దేవరాయలు చాలా ...గన్నవాడు. ఇతని తరవాత వారు ...ను బిరుదుగా వాడడము సహ ...దేశ చక్రవర్తి రాజరాజు పేరూ, ...ంగరాజు అనంతవర్మ (చోడ ...వారి తర్వాత రాజులు తమ ...ంచుకున్నారు. కాబట్టి విజయ ...న మధిష్ఠించిన రాజులు 'దేవ రాయల' పేరు ధరించడములో వింత యేమిటి ?

పెద్దనగారు కృష్ణరాయల మరణానంత రము కన్నడదేశముమీద దండెత్తివచ్చిన గజపతిని సంబోధించి చెప్పినాడన్న సీస పద్యములో 'సంపెట' నరపాల సార్వభౌ ముడువచ్చి అన్న మాటలు వేశాడు 'సంపెట' వారు తెలుగువారేగాని కన్న డులు కాదుగదా ? 'తెలుగ దేలయన్న దేశంబు తెలుగేను' అన్న పద్యములో తెలుగు విభుడనని చెప్పుకున్నాడు కృష్ణ దేవరాయలు

సింహాచల దేవాలయంలోనూ, తిరుమల దేవాలయంలోనూ కృష్ణరాయల దిగ్విజ యాలు తెలుగుభాషలో వున్నాయి సింహా చలములో దేవాలయము వెలపల పీఠపు వంపులమీద చెక్కిన కృష్ణదేవరాయల శాసనమున్నది ఇదే లోపల స్తంభముపైన కూడా ఉంది కంచి వరదరాజస్వామి ఆలయములోకూడా, దేవాలయపు గోడ మీద వెలపల పీఠపు వంపుమీదే ఉంది తెలుగు లిపిలో కృష్ణదేవరాయల శాసనము అది చదవాలంటే గుడికి కొంతవరకూ ప్రద క్షిణముచేస్తూ చదవాలి కంచిలో తెలుగు లిపిలో శాసనము చెక్కించవలసిన అగత్య మేమిటి ? చిదంబరములో ఉత్తరగోపురము ప్రవేశించి, కుడివైపు చూస్తే ఒక గూటిలో కృష్ణరాయల విగ్రహమున్నది అది మనిషి పొడవుకన్న చిన్నదీ, రాతిది కిరీటము తిరు పతిలోని ఇత్తడి విగ్రహపు కిరీటములాగ కనబడినా, సరి, గ్గా అలాంటిది కాదు. కాలికి గండపెండేరమున్నది. (తిరుపతి విగ్రహానికిదిలేదు) నాకు ...గ్రహానికి రాయలపోలిక యెక్కువున్నద...స్తున్నది ఈవిగ్రహము పక్కన రాతిమీద తెలుగు లిపిలో కృష్ణరాయల శాసనముంది (తిరు పతి విగ్రహాలమీద కూడా పేరులు తెలుగు లిపిలోనేఉన్నవి ) చిదంబరములో తెలుగు లిపిలో యేల చెక్కించవలె ? శ్రీరంగంలో మూలస్థాన దేవాలయపుగోడ పడమటి పార్శ్వపు పీఠము వంపులమీద '(సింహా చలమూ, కంచీలోలాగే) తెలుగు లిపిలో కృష్ణరాయల శాసనముంది పీఠము వంపు మీద చెక్కించడమూ, తెలుగు లిపిలో చెక్కించడమూ ప్రత్యేకశ్రద్ధను ధ్వనించ డము లేదా ?

కృష్ణరాయల దక్షిణదేశ ప్రతినిధులు, విశ్వనాథనాయకుడు, నాగమనాయకుడు, తెలుగువారే. నమ్మకస్థులు తెలుగువారయిన రాజు తెలుగువాడే కావాలి కదా !

## చిట్టిప్రశ్నలకు జవాబులు

—భూమి సూర్యుడినించి విడినది కాబట్టి సూర్యుడి చుట్టూ తిరుగుతుంది. చంద్రుడు భూమినించి విడినవాడు కనక భూమిచుట్టూ తిరుగుతాడు.

—అవును పిడకలనుండి వండగలవాయు వును తయారు చెయ్యవచ్చును అలాంటి ఫ్యాక్టరీ ఇంకా కట్టలేదు ఇంతకంటె గడ్డి నుండి కొన్ని భోజనపదార్థాలు పీల్చివేసి, మిగిలిన దానిని పశువులకు ఆహారముగా ఇవ్వడము లాభకరమైనది. ఈవిషయమై పరిశోధన జరగవలసి యున్నది

—ప్రతీ రేడియో కేంద్రమూ, రెండు మూడు రకాల మీటర్లమీద ప్రసారము చేస్తుంది నిజమే ఒకే మీటరుమీద చెయ్య కూడదా? అంటే, చెయ్యవచ్చును అప్పుడు మరిరెండు విధాల ప్రోగ్రాములు ప్రసారించ డానికి వీలుండదు చెన్నపట్నము నించి తెలుగులోనూ అరవములోనూ కూడా ప్రోగ్రాములు ఒకే కాలములో ప్రసారము చెయ్యాలి మరి రెండు వేర్వేరు మీటర్లలో ప్రసారించడము అనుకూలము కాదా ?

హెచ్చు మీటర్లలోచేసిన ప్రసారము భూమిని అంటి పాకి, ప్రసారకేంద్రానికి దగ్గరగా ఉన్న చోట్లకే అందుతుంది కనుక ప్రాదేశిక ప్రాముఖ్యతగల ప్రోగ్రాముల్ని

—బాగా కాలిన అట్లపెనముమీద నీటి చుక్కలు రాల్చండి. ఆ చుక్కలకీ పెనము నకూ మధ్యన ఆవిరి దిండు ఏర్పడి, ...దు వులు పెనమును అంటక, తామరాకుమీద నీటిబొట్టులాగ నృత్యము చేస్తాయి కాళ్లు బాగా తడువుకుని 'గుండము' తొక్కే వారి పాదాలకీ నిప్పులకీ నడుమ ఈ ఆవిరిదిండు ఏర్పడుతుందేమో, ఇది తప్ప వారి పాదాలు కాలకపోడానికి వైజ్ఞానిక కారణము ఏదీ తెలీదు

—పార్థసైటు అంటే చేరువ వస్తువు లనే కాని దూరపు వస్తువులను చూడలేక

పోవడము విద్యార్థులు తరుచు పుస్తకాలు చదవడమూ, లెక్కలు చెయ్యడమూ, బొమ్మలు రాయడమూ చేస్తూంటారు. కనక వారి కళ్ళు చేరువ వస్తువులను చూడడానికి అలవాటుపడి దూరపువస్తువులను చూడడానికి శ్రమపడతాయి. ఇదే షార్టుసైటు.

—వేలాడదీసిన దిక్సూచి ఉత్తర దక్షిణాలకు తిరగడమే భూగర్భములో పెద్ద అయస్కాంత మున్నదనడానికి నిరూపణ. సూర్యుడినుంచి వెలువడే ఎలక్ట్రానులు ధ్రువాలవైపు మొగ్గినట్లు కనబడముకూడా భూమిలోని అయస్కాంతము వల్లనే. కాస్మికు కిరణాలశక్తి ధ్రువాలవద్ద ఎక్కువగా ఉండడానికీ ఇదే కారణము.

—ప్రాణము అనగా ఏమిటో తెలీదు గాని, ఆహారమును లోపలికి తీసుకుని పెరిగేదీ, తన జాతిని వృద్ధిచేసుకునేదీ 'ప్రాణి'

—మనుష్యుని శరీరము పెరగకుండా అరికట్టవలసిన అవసరము ఇంతవరకూ ఎవరికీ కలగలేదు సోమశేఖరరావు గారూ.

—వెలుతురుపడే వస్తువులే కాని వెలుతురు కనపడదు. సూర్యుడినుంచి చంద్రుడికి పోయే వెలుతురు కనపడదు కదా?

—కాంతి ప్రవేశక ద్రవ్యముల అణువులమీద వెలుతురు పడినప్పుడు, ఈ వెలుతురు (1) అణువులనుండి కొంత బలమును పొందడమువల్లగానీ (2) కొంతబలమును అణువులకు నష్టపోడమువల్లగాని, మారడమే రామన్ ఎఫెక్టు. రెండవ మార్పు అతి సామాన్యము.

—'మొండి చెయ్యి' అనగా కుక్కగొడుగులలో ఒకరకము.

—నల్లరంగు అన్నిరంగులనూ మాషించ (పీల్చుకో) గలదు. జుట్టు సూర్యకిరణాల్ని చూషించడము వల్లనే తలపాగా, టోపీ అవసరమైనాయి.

—దోమలు దీపాలు ఆర్పినంత మాత్రాన తగ్గవు. దోమలు రాత్రించరులు కదా?

—టపాకాయలలో సురేకారమూ, బొగ్గుపొడీ గంధకమూ ఉంటాయి. ఈ పొడి అతి సన్నగా - వస్త్రకాళితము చేసినది అయి వుంటుంది నిప్పు వత్తిద్వారా ఈ పొడికి అందగానే పొడిఅంతా ఒక్కమారు భగ్గుమంటుంది. ఇందువల్ల తయారయిన వాయువులకు టపాకాయలోని అవకాశము చాలదు కనక ఈ వాయువులు కాటాకు ముడిని పీల్చుకుని వచ్చేస్తాయి. అంటే టపాకాయ పేలుతుందన్నమాట.

—చిన్న పిల్లలు నిద్రలో నవ్వడము

# తెలివితేటలు ఒకరి సొత్తా?

ఒకానొక ఆడవాళ్ల పత్రికకు ఒక యిల్లాలు యిలా జాబు వ్రాసింది :

"మా ఆయన చాలా బద్ధకస్తుడు. నేను యింట్లో ఏ పని చెప్పినా చెయ్యరు. ఈ మాటే నేనొకరోజు మా పొరుగునవున్న పుల్లమ్మగారితో అంటే, ఆవిడకూడా అదే గోలపెట్టింది; వాళ్ల ఆయనకూడా పెద్ద బద్ధకస్తుడట!

"అందుకని మేమిద్దరంకలసి ఒక మంచి ప్లానువేశాం...

"మా యింట్లో పని ఏదైనావస్తే, నేను పుల్లమ్మగారి భర్తను పిలిచి, 'యీపని కాస్త చేసిపెట్టు'మని అడిగేదాన్ని అలాగే పుల్లమ్మ గారి యింట్లో ఏదైనా పనిపడితే, ఆవిడ మా ఆయనను అడిగేది.

"మా ప్లాను మా బాగా పనిచేస్తోంది ఈ మొగాళ్లుయిద్దరూ పరాయి ఆడది అడిగిన సాయం ఎంత కష్టమైనదైనా, సరే 'ఊ' అనకుండా చేసుకువస్తున్నారు."

ఈ వుత్తరాన్ని అచ్చువేస్తూ ఆ పత్రికా సంపాదకుడు దాని అడుగున దిగువ పేర్కొన్న నోటు ఒకటి ప్రకటించాడు :

"మీ మొగుళ్లని మీ రుభయులూ కలిసి ఆడించేస్తున్నామని మీరు అనుకొంటే అనుకోవచ్చు కాని, మాకుమాత్రం అల అనిపించటంలేదు. ఒకందుకు మీకు మీ ప్లాను బాగున్నట్లుతో మీ భర్తలకీ యిదే ప్లాను మరొకందుకు మహా బాగున్నట్లు ఏమంటారా—మొగుడన్నవాడు చేసిన యింటిపని ఎంత బాగున పెళ్ళాన్ని ఒప్పించడం చాలాకష్టం. ఇది ప్రతి భర్తకీ అనుభ అదే పరాయి ఆడదానికోసం కష్టపడితే చేసినపని ఎలా వు మెప్పుమాత్రం మహా తేలిగ్గా వస్తుంది.

"అదీకాక—పరాయిఅమ్మ యింట్లో పని సాయానికి సట్టువస్తే, సుత్తి, మేకు, గొడ్డలి, రంపం వగైరా పనిముట్లు ఆ యిల్లాలే అందిస్తుంది. ఆ పనికాగానే చిందరవందరగా పడి పనిముట్లు అన్నిటిని ఆ యిల్లాలే శ్రమ అనుకోకుండా ఎక్కడి అక్కడ సర్దేస్తుంది."

"కాబట్టి మీరు వేసిన ప్లానువల్ల మీ ఒక్కరికే మీ మీ భర్తలకి కూడా చాలా లాభాలు వున్నాయన్న మాత్రం మరచిపోకండి శెలవు."

కలలు కనుటవల్లనేనమ్మా జ్యోతీ. వారికి తెలిసిన ముఖాలు పలకరిస్తున్నట్టు కలవస్తే నవ్వుతారు

—అష్టావధానమూ, శతావ లాంటివి కావు శతావధాన వారు తక్కువ కనక అదేకష్ట

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press 7 Thambu Chetty



"వార్తాహర్మ్యలు"

—ఫొటో: జె. బాబు ప్రేమనాథ్, కర్నూలు